


# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## తరగతి గదులలో క్రీడలు!



పాఠశాలలలో ప్రస్తుతం వ్యాయామానికీ, క్రీడలకూ కొంత సమయాన్ని కేటాయిస్తున్నారు. ఇది పిల్లలకు ఆనందం కలిగించే సమయం. పిల్లల శారీరక, మానసిక వికాసానికీ, అభివృద్ధికీ ఇది దోహదం చేస్తుందనడంలో సందేహం లేదు.

దీని ప్రాముఖ్యతను గుర్తించి, ఇతర పాఠాలలాగే క్రీడలను కూడా ఒక పాఠ్యాంశంగా తరగతి గదులలో బోధించే విధానం రూపొందిస్తున్నారు. ఈ విషయాన్ని అధ్యయనం చేసిన కమిటీ వచ్చే విద్యా సంవత్సరం నుంచి క్రీడలను పాఠ్యాంశంగా ప్రవేశ పెట్టాలని సిఫార్సు చేసిందని ఒక కేంద్ర మంత్రి ఇటీవల కటక్‌లో తెలియజేశారు.

దీనిని తొలుత కేంద్ర ప్రభుత్వం నడిపే కేంద్రీయ విద్యాలయాలలోనూ, నవోదయ పాఠశాలలలోనూ ప్రవేశపెడతారు. ఆ తరవాత మిగతా పాఠశాలలు వాటిని అనుసరిస్తాయి.



ఈ పాఠ్యాంశ వివరాలు ఫలానా అని ఇంకా తెలియలేదుగాని వివిధ క్రీడలు ఆడే పద్ధతులనూ, పాటించవలసిన నియమావళినీ బోధించడంతో పాటు విద్యార్థులలో పోటీమనస్తత్వాన్ని, సంఘీభావాన్ని పెంపొందించే విధంగా ఉంటుందని ఆశించవచ్చు. సక్రమమైన అభ్యాసంతో ఏకార్యాన్నయినా సాధించవచ్చు అన్న అనుభవజ్ఞానాన్ని పసి హృదయాలలో కలిగించడానికి ఈ విధానం ఉపయోగ గలదని ఆశించవచ్చు.

సంపుటి : 97 ఆగస్ట్ '95 సంచిక :

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00



వార్తలు - విశేషాలు :

# అంతరిక్షంలో కరచాలనం!

అంతరిక్షంలో సోవియట్ రష్యా నిర్మించిన 'మీర్' స్పేస్ స్టేషన్‌తో అమెరికా పంపిన స్పేస్ షటిల్ 'అట్లాంటిస్' జూన్ 29వ తేదీ ఒకటిగా కలిసింది!

ఇటువంటి అద్భుతమైన 'డాకింగ్' జరగడం గత 20సంవత్సరాలలో ఇది రెండవసారి. 1975వ సం॥ జూలై నెలలో అమెరికా వ్యోమనౌక 'అప్పోలో' సోవియట్ వ్యోమనౌక 'సోయుజ్'ను సంధించింది. ఆ సమయంలో ఉభయ దేశాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతూ ఉండేది. అందువల్ల ఆ సంఘటన ఎటువంటి పెద్ద రాజకీయ ప్రాముఖ్యతనూ సంతరించుకోలేకపోయింది. అయితే అలా సంధించడానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి అదొక అవకాశంగా మాత్రమే మిగిలింది. సోవియట్ యూనియన్ విచ్ఛిత్తి తరవాత రష్యా - అమెరికాల మధ్య పగ అంతమయింది. ఉభయ దేశాలు స్నేహంతో చేతులు కలిపాయి.దాని ఫలితంగా ఇప్పుడు అంతరిక్షంలో దాదాపు 15 దేశాలు కలుసుకోవడానికి వీలుగా ఇంటర్నేషనల్ స్పేస్ స్టేషన్ నిర్మించడంతో పాటు వివిధ పథకాలు రూపొందించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి!

ఏడుగురు వ్యోమగాములతో 'అట్లాంటిస్' అమెరికా నుంచి జూన్ 27వ తేదీ బయలుదేరింది. రెండురోజుల పాటు అది 'మీర్' వెంట తిరిగిన తరవాత దానితో 'డాకింగ్,' అంటే కలయిక సాధ్యమయింది.జూన్ 29వ తేదీ రెండూ ఒకటిగా కలవడంతో అది చూడడానికి పెద్ద వ్యోమనౌకగా తయారయింది. హ్యూస్టన్ నుంచి, కాలినిన్ గ్రాడ్‌నుంచి అంటే భూమి నుంచి, వ్యోమగాములకు 'మీర్' లో ప్రవేశించమని సంకేతాలు పంపడానికి విజ్ఞాన వేత్తలకు రెండు గంటలసేపు పట్టింది. ఆ తరవాత వ్యోమగాముల మధ్య పరస్పర కరచాలనాలు, కౌగిలింతలు ఆరంభమయ్యాయి!

మధ్య ఆసియాలో రష్యా - మంగోలియా సరిహద్దు రేఖకు పైన అంతరిక్షంలో దాదాపు 245 మైళ్ళకు అవతల ఏమాత్రం లోపంలేని ఈ'డాకింగ్' సాధ్యమయింది. రెండు వ్యోమనౌకలూ అప్పుడు సెకండుకు 5 మైళ్ళ వేగంతో తిరుగుతున్నాయి. 122 అడుగుల పొడవుగల అట్లాంటిస్, 112 అడుగుల పొడవుగల మీర్‌తో కలిసినప్పుడు, అమెరికా కమాండర్ కేప్టెన్ గిబ్సన్, "మేము పట్టుకున్నాం!"అని ఆనందాన్ని వ్యక్తం చేశాడు.

ఆ తరవాత అయిదు రోజులు 'మీర్' లోపల రకరకాల ప్రయోగాలు జరిపారు. ఆ పిమ్మట 'మీర్'లోని నార్మన్ థాగార్డ్‌తో సహా ముగ్గురు వ్యోమగాములు తిరుగు ప్రయాణానికి అట్లాంటిస్‌కు చేరారు. వాళ్ళ స్థానానికి 'అట్లాంటిస్'లోని వ్యోమగాములు వెళ్ళారు. ఆ తరవాత ఇద్దరు 'మీర్' నుంచి వెలుపలికి వచ్చి, 'సోయుజ్' అటాచ్‌మెంట్‌కు వెళ్ళి రెండూ విడిపోయే దృశ్యాన్ని ఫొటోలు తీశారు. ఆ తరవాత వాళ్ళుకూడా 'మీర్'లోకి వెళ్ళే దృశ్యాన్ని కూడా ఫొటో తీశారు. అట్లాంటిస్ అక్కడినుంచి బయలుదేరి జూలై 7వ తేదీ భూమికి చేరింది.

చారిత్రాత్మకమైన ఈ 'డాకింగ్'ను టీ.వీ.లో చూసిన అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్,"చూశారా! ఇరు దేశాలకు మధ్య ఇప్పుడు ఎలాంటి స్పర్థలూ లేవు," అన్నారు.





# వీరుడి ఓటమి

దండకారణ్యంలోని ఒకానొక ప్రాంతాన, కొంతమంది భిల్లజాతి వాళ్ళుండేవారు. వాళ్ళ నాయకుడు సింహబలుడు. అతడి నాయకత్వంలో భిల్లులందరూ ఎటువంటి పొరపొచ్చాలు లేకుండా ఐక్యంగా వుండేవాళ్ళు.

కొంతకాలానికి సింహబలుడు వృద్ధుడైపోయాడు. ఒకప్పుడు, చిన్న చురకత్తితో పులిని ఎదిరించి అవలీలగా చంపగలిగిన అతడికి, ఇప్పుడు నడవడానికి కర్రసాయం అవసరం అయింది. ఇందువల్ల, సింహబలుడు భిల్లుల నాయకత్వ బాధ్యతను సమర్థుడైన యువకుడెవరికైనా అప్పగించాలని భావించాడు.

నిజానికి భిల్లజాతిలో బలమున్న వాడే నాయకుడన్న కట్టుబాటున్నది. ఎవరైనా నాయకత్వ పదవికి పోటీ చేయవచ్చు. అయితే, సింహబలుడి పట్లగల గౌరవం కొద్దీ, ఎవరూ అతడి నాయకత్వపీఠం కోసం పోటీపడలేదు.

సింహబలుడికి కొడుకులు లేరు. ఒక్కతే కూతురు. పేరు మల్లిక. ఆమె అద్భుత సౌందర్యరాశి. నాయకుడికి మగసంతు లేకపోతే, తర్వాత నాయకుడయ్యే వాడితో, అతడి కూతురు పెళ్ళి జరపాలన్నది భిల్లుల ఆచారం. అదెంత కష్టసాధ్యమైన కార్యమో తెలిసి వున్నా, చాలామంది యువకులు మల్లికను పెళ్ళాడాలని కలలుకనేవారు.

భిల్లుల గూడెంలో కన్నప్ప అనే యువకుడున్నాడు. వాడు అందగాడే కాక గొప్ప బలశాలి. మల్లికకు వాడంటే ఎంతో అభిమానం. వీలైనప్పుడు ఇద్దరూ ఏకాంత ప్రదేశంలో కలుసుకుని కబుర్లు చెప్పుకునేవారు.

ఒక మంచిరోజు చూసుకుని సింహబలుడు, భిల్లులనాయకత్వానికి పోటీలు జరుగుతాయనీ, ఇందుకు బలమైన యువకులు సంసిద్ధులు కావాలనీ చాటింపు వేయించడంతోపాటు, పోటీలో నెగ్గిన యువ

ఎన్. శివనాగేశ్వరరావు

కుడితో, తనకుమార్తె మల్లికవివాహం జరుగుతుందని కూడా తెలియపరిచాడు.

ఈచాటింపు విని కన్నప్ప, మల్లిక మెడలో మూడు ముళ్ళు వేసినంత ఆనందపడ్డాడు. వాడికి తనబలం మీదనమ్మకముంది. తప్పక యువకులందర్నీఓడించగలననేభావించాడు.

అయితే, ఆ గూడెంలోనే శిఖిముఖి అనే యువకుడొకడున్నాడు. వాడికి తండ్రిలేడు, తల్లి చాముండిక. ఆ గూడెంలో అందరూ సింహబలుడి మంచితనాన్నే ఎరుగుదురు. కాని, సింహబలుడిలోని క్రౌర్యాన్ని చూసిన మనిషి చాముండిక.



చాముండిక భర్త అయిన భద్రబలుడు శక్తివంతుడు. సింహబలుడు భిల్లులకు నాయకుడైన కొత్తలో, తన నెదిరించి నాయకుడు కాగలవాడెవడా అని ఆరా తీశాడు. అతడికి భద్రబలుడి గురించి తెలిసింది. భద్రబలుడి వంటి బలశాలిని ఉపేక్షిస్తే, తన పదవికి ప్రమాదం కలగవచ్చని భావించిన సింహబలుడు, అతడిమీద కక్ష కట్టి రహస్యంగా చంపించాడు.

ఇది జరిగిన సమయంలో భద్రబలుడి కొడుకుకి శిఖిముఖికి ఐదేళ్ళ వయసు. తన భర్తను సింహబలుడు రహస్యంగా చంపించాడని తెలుసుకున్న చాముండిక, ఒకనాడు అతణ్ణి ఒంటరిగా కలుసుకుని, "సింహబలా! ఏ నాయకత్వం కోసం భయపడి, నా భర్తను చంపించావో, ఆ నాయకత్వాన్ని ఏదో ఒక నాడు నా కొడుకు శిఖిముఖి చేజిక్కించుకోగలడు. ఇది నా శపథం!" అన్నది.

ఇందుకు సింహబలుడు మీసం మెలివేసి, "అది అసంభవం! ఎవరి అండా లేని నీ కొడుకు భిల్లులనాయకుడు కావడమా?" అంటూ అవహేళన చేశాడు.

ఆ తర్వాత సింహబలుడు, చాముండిక విషయం పూర్తిగా మరిచిపోయాడు.

అయితే, చాముండిక మాత్రం సింహబలుడి క్రూరత్వానికి గురైన భర్తను మరిచిపోలేదు. ఆమె శిఖిముఖి భిల్లుల నాయకుడయేందుకు ఎంతో పట్టుదలతో కృషి చేసింది. ఆమె పట్టుదల వృథా కాలేదు. చూస్తుండగానే శిఖిముఖి కత్తి, కర్ర, మల్ల, విలు విద్యల్లో



ఆరితేరాడు. అయితే, అతడు బలశాలిగా గానీ, వీరుడుగా గానీ ఎవరి ముందూ బయటపడలేదు. అలా జరిగితే - సింహ బలుడి చేతిలో తన కొడుకు కూడా హత మవుతాడనే భయంవల్ల, చాముండిక తగు జాగ్రత్తలు తీసుకున్నది.

గూడెంలోని భిల్లజాతి వాళ్ళందరూ, అంకాలమ్మ అనే దేవతను కొలుస్తారు. ప్రతి ఏటా ఆ దేవతకు జాతర జరుగుతుంది. ఆ జాతరదినానే, కొత్తభిల్లుల నాయకుణ్ణి ఎంపిక చేయాలని సింహబలుడు నిర్ణయించి, ఆ ముందు రోజున పోటీలు ఏర్పాటు చేశాడు.

ఈ పోటీలు మూడు రకాలుగా వుంటాయి. మొదటిదిశారీరకబలానికిసంబంధించిన మల్ల యుద్ధపోటీ.రెండోది ధైర్యానికి సంబంధించి నది.చిన్నకత్తితో పులితోపోరాడాలి. మూడవది, విలువిద్యా నైపుణ్యానికి సంబంధించినది. అంకాలమ్మ విగ్రహం ముందు పళ్ళాలలో పసుపు కుంకుమలు వుంచుతారు. ఆపళ్ళాలు కిందపడకుండా, కేవలం వాటిల్లోని పసుపు కుంకుమలు మాత్రం అంకాలమ్మ విగ్రహం మీద పడేలా బాణం కొట్టగలగాలి.

పోటీకి తలపడిన యువకులను సింహ బలుడు రెండు దళాలుగా విభజించాడు. మొదటగా మల్లయుద్ధ పోటీలు జరిగాయి. మొదటి దళంలో కన్నప్ప, రెండో దళంలో శిఖిముఖి విజేతలుగా ఎంపిక అయ్యారు. రెండో పోటీలో కన్నప్ప, శిఖిముఖి చెరొక చిన్నకత్తి తీసుకుని, పులితో పోరాడేందుకు బోనుల్లోకి ప్రవేశించారు. కన్నప్ప, శిఖిముఖి కూడా బలంగా గాయపడినా, చివరకు బోనుల్లోని పులులను చంపగలిగారు.

మూడవదయిన విలువిద్య పోటీ, అంకా లమ్మ జాతరరోజు జరుగుతుందని ప్రకటిం చాడు, సింహబలుడు.

పులులతో పోరాటం ముగిశాక కన్నప్ప, శిఖిముఖి గురించి ఆరాతీశాడు. అప్పుడతడికి శిఖిముఖి బలపరాక్రమాల గురించి వివరంగా తెలిసింది. విలువిద్యలో కన్నప్పకున్న ప్రావీ ణ్యంఏమంత చెప్పుకోదగినది కాదు. అందు వల్ల, తను తప్పక ఓటమి పొందే అవకాశము న్నది. అప్పుడు, శిఖిముఖికి భిల్లుల నాయకత్వ

పీఠమేగాక,తను ఎంతగానో ప్రేమించిన మల్లిక కూడా దక్కుతుంది!

కన్నప్ప పుట్టెడు దిగులుతో, ఆ రాత్రి మల్లికకు సంగతంతా చెప్పి, "శిఖిముఖి వంటి మహావీరుడు మన గూడెంలో వున్నాడని, ఇంతకాలంనేనుతెలుసుకోలేకపోయాను. విలువిద్యలో అతణ్ణి జయించగలనన్న నమ్మకం,నాకేమాత్రం లేదు," అన్నాడు.

ఇది విని మల్లిక కళ్ళనీళ్ళు పెట్టుకుని, "నీతో పెళ్ళికాకపోతే, నేను ఏ నుయ్యో, గొయ్యో చూసుకుంటాను తప్ప, మరొకరిని పెళ్ళాడను!" అన్నది.



ఆ తర్వాత ఇద్దరూ బాగా ఆలోచించి, ఆరాత్రికి రాత్రే శిఖిముఖిని కలుసుకున్నారు. కన్నప్ప తనకు మల్లికపై గల ప్రేమ గురించి చెప్పి, ఆమెతో తన పెళ్ళి జరిగేలా చూడమని బతిమలాడాడు. మల్లిక, అతడి పాదాలు తాకి, "అన్నా! ఈ చెల్లి కోరిక మన్నించు," అని చిన్నగా రోదించింది.

అప్పుడు శిఖిముఖి, కన్నప్పతో, "కన్నప్పా! మీ ఇద్దరూ నాకు విషమపరీక్ష పెట్టారు. ఈ పోటీల్లో గెలవాలన్నదే, నా జీవితాశయం. అదే నా తల్లి కోరిక కూడా. అయితే, నిజాయితీగా ఒక ప్రశ్నకు జవాబు చెప్పు. భిల్లుల నాయకత్వం లేక మల్లిక -- ఈ రెండిటిలో ఒకటే నీకు దక్కుతాయంటే, దేన్ని కోరుకుంటావు?"అని ప్రశ్నించాడు. ఆవెంటనే కన్నప్ప, "భిల్లనాయకత్వం నాకు గడ్డిపోచతో సమానం. నేను మనసా కోరుకునేది మల్లికను!" అన్నాడు.

"నీ నిజాయితీ నాకు నచ్చింది!" అని శిఖిముఖి మల్లికను పంపించేసి, అప్పటికప్పుడు, మర్నాడు జరగబోయే విలువిద్య పోటీకి సంబంధించిన కొన్ని మెలకువలు కన్నప్పకు వివరించాడు. కన్నప్ప, శిఖిముఖికి పాదాభివందనంచేసి,"గతంలో నీలాంటి గురువు నాకు లభించక పోవడం, నా దురదృష్టం!" అని వెళ్ళిపోయాడు.

మర్నాడు భిల్లులందరూ అంకాలమ్మ గుడి ముందు చేరారు. తొలిగా శిఖిముఖి వేసినబాణం,అంకాలమ్మవిగ్రహంముందున్న పసుపు కుంకుమల పళ్ళాలకు కాస్త దూరంగా దూసుకుపోయింది. కన్నప్ప వేసిన బాణం

మాత్రం,పళ్ళాలు కిందపడకుండా, అందులో వున్న పసుపు కుంకుమలను రాసుకుంటూ పోయి, అంకాలమ్మ విగ్రహం మీద ఆపసుపు కుంకుమలు పడేలా చేసింది.

భిల్లులందరూపెద్దగా హర్షధ్వానాలుచేశారు. అప్పుడు సింహబలుడు, కన్నప్పను భిల్లుల నాయకుడుగా, అలంకరించిన పీఠం మీద కూర్చోబెట్టి, తన కుమార్తె మల్లికతో వివాహం జరిపించాడు.

శిఖిముఖి ఓడినా, అతడి సాహస బలపరాక్రమాలు సింహబలుడిని ఆశ్చర్యపరిచాయి. అతడు గూడెంలో కొందరిని ప్రశ్నించి, శిఖిముఖి చాముండిక కొడుకని తెలిసి మరింతగా ఆశ్చర్యపోయాడు.

అతడు, చాముండికను పిలిపించి, "ఇది చాలాకాలం కిందటి మాటనుకో! నీ కొడుకు భిల్లనాయకుడు కాలేడని చెప్పాను, అంతే జరిగింది. పాపం, నీ శపథం ఏమయింది? అంటూ నవ్వాడు.

అప్పుడు చాముండిక, "నా శపథమా? నెరవేరింది! సింహబలా! ఒకప్పుడు నువ్వు నరరూప రాక్షసుడివి. కాని, ఈనాడు కళ్ళ ముందు ఏం జరుగుతున్నదీ కూడా చూడలేని అంధుడివి!" అంటూ వెళ్ళిపోయింది.

ఈ జవాబు విని నివ్వెరపోయిన సింహబలుడు ఆలోచనలో పడ్డాడు. మల్లిక జరిగినదేమిటో తండ్రికి వివరించింది.అంతా విన్న సింహబలుడు, "చిత్రంగా వుంది. ఇదివీరుడి ఓటమి అన్నమాట!" అన్నాడు ఆశ్చర్యపోతూ.

ఆ తర్వాత నెల తిరక్కుండానే శిఖిముఖి, కన్నప్పతో బలపరీక్షకు తలపడ్డాడు. భిల్లుల ఆచారం ప్రకారం, నాయకుడైనవాడు తన మీద కాలుదువ్విన వాడితో పోరాడి, తనబలం నిరూపించుకోవాలి. శిఖిముఖి అందులో కన్నప్పను సునాయాసంగా ఓడించాడు.

అప్పుడు కన్నప్ప, శిఖిముఖికి భిల్ల నాయకత్వం అప్పగించాడు. సింహబలుడు, శిఖిముఖిని కౌగలించుకుని, "నీ త్యాగం అపూర్వమైనది. చిన్నవాడివైనా, శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను!" అన్నాడు.

ఆ దృశ్యం చూసి శిఖిముఖి తల్లి చాముండిక గర్వంతో పొంగిపోయింది.





# సూరన్న చదువు

తాళ్ళపూడి అనే ఊళ్ళో, సూరన్న అనే చిన్న రైతు వుండేవాడు. అతడురోజూసాయంత్రం వేళ ఊరి రచ్చబండ దగ్గరకుపోయి, అక్కడ చేరినవాళ్ళు మాట్లాడుకునే పిచ్చాపాటీ వింటూండేవాడు. ఒక్కొక్కసారి తనూ కల్పించుకుని ఏదైనా మాట్లాడబోతే, మిగతా వాళ్ళు హేళనగా నవ్వి ఆటపట్టించేవాళ్ళు.

ఇలా జరిగినప్పుడు సూరన్న ముఖం చిన్నబుచ్చుకుని, మారు మాట్లాడకుండా అక్కడి నుంచి లేచిపోయేవాడు. కాని, మర్నాడు రచ్చబండ దగ్గరకు వెళ్ళడం మాత్రంమానే వాడుకాడు. ఇలావుండగా – ఒకనాడు పరమేశం అనే పెద్దమనిషి రచ్చబండ దగ్గరకురాగానే, అక్కడ చేరిన వాళ్ళల్లో ఒకడు, "నేత్ర వైద్యుడిదగ్గరకు పట్నం వెళ్ళాలన్నావు.వెళ్ళావా, ఏమైంది?" అని అడిగాడు. వెంటనే పరమేశం జేబులోంచి కళ్ళజోడు బైటికితీసి, అందరికీ చూపిస్తూ," "వెళ్ళి వచ్చాను. ఇదిగో, ఆ నేత్రవైద్యుడిచ్చిన కంటిఅద్దాలు. ఆయన సామాన్యుడుకాడు. ఇవి పెట్టుకున్నాక అన్నీ చదవగలుగుతున్నాను. ఇంతకుముందు పెద్దబాలశిక్షలో అక్షరాలుచదవాలన్నా ఎంతో కష్టమైపోయేది!" అన్నాడు.

"సరైన కళ్ళద్దాలే వుండాలిగానీ, మనం చదవలేనిది ఏముంటుంది?" అన్నాడొకడు.

"నేనూ ఆ నేత్రవైద్యుడి దగ్గరకు వెళ్ళి రావాలి. ఏం చదవాలన్నా సాధ్యపడడంలేదు," అన్నాడు మరొకడు.

ఈ సంభాషణవిన్న సూరన్నకు ఆశ్చర్యంతో పాటు చాలా ఆనందం కలిగింది. అతడు మర్నాడే బయలుదేరి పట్నంచేరి, నేత్రవైద్యుడి కోసం వాకబు చేస్తూ, "మాఊరి పెద్ద పాపయ్య రెండోకొడుకుపరమేశానికిచదివేకంటి అద్దాలిచ్చిన నేత్రవైద్యుడెక్కడున్నది కాస్తచెబుతారా?" అంటూ వాళ్ళనూ వీళ్ళనూ అడగసాగాడు.

వారణాశి శ్రీరామక్రిష్ణ

చాలా మంది మాకు తెలియదన్నారు. చివరకు ఒకడు సూరన్నను ఎగాదిగాచూసి, "ఇక్కడి వాళ్ళకు మీ ఊరేదో, ఆ పరమేశం అనే ఆయన ఎవరో బొత్తిగా తెలియదు. కనక, ఆ గొడవంతా వదిలేసి, ఇదిగో, ఈ పక్కవీధిలోకి వెళ్ళు. అక్కడ సోమసుందరం అనే మంచి నేత్రవైద్యుడున్నాడు. అదృష్టం వుండాలిగాని, ఆయన పుట్టుగుడ్డివాళ్ళకైనా కంటిఅద్దాలివ్వగలడు," అని చెప్పాడు.

సూరన్న వెతుక్కుంటూ సోమసుందరం దగ్గరకు వెళ్ళాడు. అతడు, వైద్యుడికి తన ఊరూ, పేరూ చెప్పి, "అయ్యా! మా ఊరు పరమేశానికి కంటి అద్దాలిచ్చింది మీరేనా? ఆయనఅన్నీచదవగలుగుతున్నాడు,"అన్నాడు.

నేత్రవైద్యుడు, ఒక క్షణం ఆలోచించి, "ఊరేదో తెలియదుగాని, పరమేశం అనే ఆయనకు కంటిఅద్దాలిచ్చింది మాత్రం నేనే," అన్నాడు. ఆ జవాబుతో సూరన్న పరమానంద పడిపోయి,"అయ్యా! అదృష్టం అంటే నాదే. ఆ పరమేశానికిచ్చిన లాంటికళ్ళద్దాలే, నాకూ ఇవ్వండి,"అన్నాడు.

నేత్రవైద్యుడు, సూరన్నను కుర్చీలో కూర్చో బెట్టి, నిమ్మకాయంత అక్షరాలనుంచి, కుంకుడుగింజంత అక్షరాలవరకూ రాసివున్న ఒక చెక్కబల్లను, అతడికి చూపిస్తూ, "ఏం చదవగలవో చెప్పు?" అన్నాడు.

సూరన్న ఆ అక్షరాలకేసి చూసి, చదవ లేనన్నాడు. అప్పుడు నేత్రవైద్యుడు, అతడి కళ్ళకు ఎన్నోరకాల అద్దాలు పెట్టి చూశాడు. అయినా, సూరన్న చదవలేనన్నాడు.

ఆ జవాబుతో విసిగిపోయిన నేత్రవైద్యుడు, "నీకళ్ళలో వున్న దోషం ఏమిటోగాని బొత్తిగా అంతుబట్టడంలేదు!" అన్నాడు.

దానికి సూరన్న, "మీరిచ్చిన కళ్ళద్దాలతో అన్నీ చదవగలుగుతున్నానని, మా ఊరిపర మేశం చెప్పాడు. నాకు బొత్తిగా చదువులేక పోయినా, అన్ని పుస్తకాలు చదవాలని చాలా కోరిక. అందుకే, ఆపరమేశానికిచ్చిన అద్దాల్లాం టివి, నాకూ ఇస్తారని మీ దగ్గరకు వచ్చాను," అన్నాడు.

ఇది విన్న నేత్రవైద్యుడికి మూర్ఛవచ్చి నంతపనైంది.






## 2

[ట్రోయ్ పతనానంతరం ఇంటికి బయలుదేరిన రూపధరుడూ, అతని అనుచరులూ, నౌకలూ తుఫానులో పడి చాలారోజులు కొట్టుకుపోయి చిట్టచివరకు ఒక దీవిని చేరుకున్నారు. ఆ దీవిలో ఉండేవాళ్లను గురించి తెలుసుకోవటానికి బయలుదేరి, రూపధరుడు పన్నెండుమంది అనుచరులతో సహా ఒకగుహలోచిక్కుకున్నాడు. ఆగుహ ఫాలలోచనులనేజాతికిచెందినరాక్షసుడిది. తరువాత]

ఆ రాక్షసుడి గొంతు వినేసరికల్లా గ్రీకులకు గుండెలు అవిసి పోయాయి.

రూపధరుడే సాహసించి రాక్షసుడితో ఈ విధంగా అన్నాడు:

"అయ్యా, మేము ట్రోయ్‌నుంచి తిరిగి ఇళ్లకుపోతున్నగ్రీకులము. దైవవశాన సముద్రం మీదపెనుగాలివీచిమానౌకలుమార్గంతప్పాయి. మేమిక్కడికి వచ్చి పడ్డాము. మా ప్రభువైన రారాజు జగద్విఖ్యాతి కన్నవాడు. ఆయన ఎన్నో దేశాలను జయించాడు, ట్రోయ్‌ని భస్మీపటలం చేశాడు. మేము మీకు అభ్యాగతులము. అభ్యాగతి దేవుడిలాటి వాడంటారు. కనుక తమరు మాకు తగురీతిగా ఆతిథ్యం ఇచ్చి, మమ్మల్ని అన్ని ఆపదలనుంచీ కాపాడవలసిందని మా ప్రార్థన!"

ఈ మాటలువినిరాక్షసుడువికటాట్టహాసం చేసి, "ఓరీ మతిమాలినవాడా! మేము దేవతలనూ, గీవతలనూ లక్ష్యపెట్టేవాళ్లం కాము. మా ఫాలలోచనులముందు ఏ దేవతలూ ఆగలేరు, తెలిసిందా? ఇంతకూ మీ పడవనుఎక్కడ



లంగరు వేశారు? దగ్గిరలోనేనా, దూరాననా? ఆ సంగతి ముందు చెప్పు!" అన్నాడు.

రాక్షసుడీ ప్రశ్న ఎందుకు వేశాడో రూపధరుడికి అర్థమయింది. అతను యుక్తిగా, "మాకింకా పడవఎక్కడిది? అది మీ తీరానగల కొండలకు తగిలి ధ్వంసమైపోయింది. నేనూ ఈ నా అనుచరులూ తప్ప మిగిలిన వాళ్లందరినీ వరుణదేవుడు తన పొట్టన పెట్టుకున్నాడు!" అన్నాడు.

రాక్షసుడింకేమీ అనలేదు. వాడు చేతులు చాచి ఇద్దరు గ్రీకులను అందుకుని, నేలకు వేసికొట్టిచంపి, వండుకుని ఎముకలు కూడా విడిచిపెట్టకుండాతినేశాడు. ఇదికళ్లారా చూసిన రూపధరుడికీ, అతని అనుచరులకూ ప్రాణాలు నీరసించిపోయాయి. ఫాలలోచనుడు తన భోజనం పూర్తిచేసి అయిదారు కడవల పచ్చి పాలు తాగేసి, తన గొర్రెల మధ్యన చాచుకుని పడుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

రూపధరుడు కత్తిదూసి నిలబడ్డాడు. ఆ రాక్షసుడిరొమ్ము తడివిగుండె ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని ఒక్కపోటుతో వాణ్ణి చంపేద్దామని అతను ఆలోచించాడు. కాని అంతలోనే అతని కొక సంగతి జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే, గుహకురాక్షసుడు అడ్డం పెట్టినరాయిని కదిలించటం తనవల్లా, తన అనుచరులవల్లా అయేపనిగాదు. ఇప్పుడుగనుకతానురాక్షసుణ్ణి చంపేసినట్టయితే, తానూ, తన అనుచరులూ ఈగుహలోనే తిండికి మాడిఘోరమైన చావు చావవలసి ఉంటుంది. తమను రక్షించగల వారెవరూ ఉండరు. అందుచేత రూపధరుడు కత్తినిఒరలో పెట్టేసితనయథాస్థానంలో పడుకున్నాడు. ఆ రాత్రి అతనికి నిద్రలేదు.

తెల్లవారింది. రాక్షసుడు లేచి, నిప్పుచేసి, తనగొర్రెలు, మేకలన్నిటినీపాలుపితికి, పిల్లలను వదిలాడు. తరవాత మరి ఇద్దరు గ్రీకులను చంపి తినేసి, మందలను తోలుకుని గుహ బయటికి వెళ్లాడు. ఈసారి వాడు పెద్దరాయిని గుహకు అడ్డంగా పెట్టి, గ్రీకులు తప్పించుకుపోకుండా చేశాడు.

ఆ రాక్షసుడు తన మందలను మేపుకోవటానికి వెళ్లాక, రూపధరుడు కాలుకాలిన పిల్లిలాగా అటూ ఇటూ పచారుచేయసాగాడు. తన అను

చరులను చంపితిన్న ఈ రాక్షసుడిపైన ఎట్లా పగతీర్చుకోవాలా అన్నసమస్య అతన్ని బాధిస్తు న్నది. అతను తన ఇష్టదేవత అయిన బుద్ధిమతీ దేవిని ఎంతగానో ప్రార్థించాడు.

చివరకు అతనికి ఒక ఉపాయం తట్టింది.

ఆ గుహలో ఉండే రాక్షసుడు, తనకు చేతి కర్ర ఒకటి తెచ్చి గుహలో ఉంచుకున్నాడు. అది ఇంకా పచ్చిగానే ఉన్నది. అది రమారమి తెరచాప స్తంభమంత లావున్నది. అంతే పొడు గుకూడా ఉన్నది. రూపధరుడు ఈ కర్రలో మనిషి ఎత్తు ముక్క కోయించాడు. దాని కొన సన్నగా చెక్కి, నిప్పులో కాల్చి గట్టిచేసి గుహలో ఉన్న పేడకుప్పలో దాచాడు. ఆ రాత్రి రాక్షసుడు నిద్రపోయేటప్పుడు ఆ కర్ర మొనతో రాక్షసుడి ఒంటికన్ను కాస్తా పొడిచి, వాణ్ణి గుడ్డివాణ్ణి చేసెయ్యాలని రూపధరుడి ఆలోచన. ఇందుకుగానుఒక్కమనిషిచాలడు. తనకు సాయపడటానికి తన అనుచరులలో మరి నలుగురుని రూపధరుడు ఎన్నుకున్నాడు.

సాయంకాలం కాగానే రాక్షసుడు తన మందలనుతోలుకుని గుహకుతిరిగి వచ్చాడు. గొర్రెలనూ, మేకలనూ పాలుతీసినాక గుహ ద్వారంఎప్పటిలాగే మూశాడు; తరవాత మరి ఇద్దరు గ్రీకులను పట్టుకుని చంపి తిన్నాడు.

ఈలోపుగా రూపధరుడు ఒక కొయ్యపాత్రలో తనవద్ద వున్న పానీయంనింపి, దాన్ని పట్టు కుని రాక్షసుణ్ణి సమీపించి, అతడితో ఈ విధంగా అన్నాడు:



"ఫాలలోచనా, ఇంద ఈ పానీయం రుచి చూడు. నీకు నరమాంసం రుచి తెలుసు గాని పానీయం రుచి తెలియదు. ఈ దివ్య మైన పానీయాన్ని నీకోసం తెచ్చాను. కాని నువ్వు చాలా చెడ్డవాడివి. మామీద నీకు కాస్త అయినా కనికరంలేదు. ఇలా ప్రవర్తించి నట్టయితే ఎవ రైనా నిన్ను చూడవస్తారా?"

రాక్షసుడు రూపధరుడు అందించిన కొయ్య పాత్ర అందుకుని అందులోని పానీయాన్ని గడగడా తాగేశాడు. వాడికది చాలా రుచిగా కనిపించింది.

"ఈ పానీయం ఇంకావుంటే పొయ్యి. నీ పేరేమిటో కూడా చెప్పు! నీకు మా ఆచారం ప్రకారం అతిథి సత్కారం చేస్తాను. ఇక్కడ



మేముకూడా ద్రాక్షరసంతాగుతాముగాని,దానికీ రుచి లేనే లేదు!" అన్నాడు రాక్షసుడు.

రాక్షసుడీ మాట అన్నప్పటికీ రూపధరుడు తగుజాగర్తమీదనేఉన్నాడు. "నా పేరు ఉత్తుత్త మనిషి! అన్న ప్రకారం నాకు అతిథి సత్కారం చెయ్యాలిసుమా!" అన్నాడతను. అతను రాక్షసుడికి మూడుసార్లు పానీయం ఇచ్చాడు.

"అయితే, ఉత్తుత్త మనిషీ, నిన్ను ఆఖరుకు తింటాను. మిగిలినవాళ్లందరూ అయిపోయే దాకా నీజోలికి రాను. ఇదే మేముచేసే అతిథి సత్కారం!" అన్నాడు రాక్షసుడు. ఈ మాట అంటూనే వాడు మైకంవచ్చి గొడ్డులా పడిపోయి నిద్రపోసాగాడు. రూపధరుడు పేడకుప్ప లోనుంచి కర్రను తీసి దానికొనను నిప్పులలో పెట్టి, తన అనుచరులకు ధైర్యం రాగలందులకు ప్రోత్సాహ వచనాలు చెప్పాడు. కొద్దిసేపట్లో కర్ర కొన ఎర్రగా కాలింది. రూపధరుడి అనుచరులు మొండిధైర్యం తెచ్చుకున్నారు. వారి సహాయంతో రూపధరుడు ఆ కర్రను రాక్షసుడున్న చోటికి తీసుకుపోయి, ఎర్రగా కాలే కొనను రాక్షసుడి కంట్లోబలంగా గుచ్చేశాడు.

గుహయావత్తూదద్దరిల్లే పెడబొబ్బతో రాక్షసుడు లేచాడు. వాడు తన కంట్లో గుచ్చుకుని వున్న కర్రను ఊడబెరికి దూరంగా పారేసి, ఇతర ఫాలలోచనుల కోసం కేకలు పెట్టసాగాడు. ఆ పరిసరాలలో ఉన్న గుహలలో నివసించే రాక్షసులు వాడి పెడబొబ్బలువిని పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్లు గుహ బయటి నుంచి, "ఏం జరిగింది? ఎందుకలా రంకెలు పెట్టి, అర్ధరాత్రివేళ మా నిద్రను చెడగొట్టుతున్నావు? ఎవరన్నా నీ మందలను ఎత్తుకుపోయారా? ఎవరన్నా నిన్నుబలంతోగాని, యుక్తితో గాని చంపుతున్నారా?" అని అడిగాడు.

"అవునవును, నన్నుఉత్తుత్తమనిషియుక్తితో చంపుతున్నాడు," అన్నాడు గుహలో ఉన్న రాక్షసుడు.

"ఉత్తుత్తమనిషి చంపటమేమిటి? వెర్రి వేషాలు వెయ్యక పడుకో. ఒంట్లో సరిగా లేకపోతే తెల్లారే లోపల అదే సద్దుకుంటుంది!" అంటూమిగిలిన ఫాలలోచనులు తమ దారిన తాము వెళ్లిపోయారు.

ఆ తరవాత గుహలో ఉండే రాక్షసుడు, చూడటానికి కన్ను లేదుగనక, తడువుకుంటూ గుహద్వారం వద్దకు వెళ్ళి, ఆద్వారానికి అడ్డం గావున్న రాతిని ఎత్తి పక్కన పెట్టి, ద్వారానికి అడ్డంగా తిష్ఠవేసి, కావలి కూచున్నాడు.

గ్రీకులు బయటికి వెళ్ళటానికి యత్నిస్తే పట్టుకుందామని వాడి ఉద్దేశం.

కాని రూపధరుడు వాడనుకున్నంత అమాయకుడు కాడు. ఈ గుహలోనుంచి తానూ, తన అనుచరులూ బయటపడటానికి అనేక మార్గాలను అతను అదివరకే ఆలోచించి పెట్టాడు. వాటన్నిటిలోకీ అతనికి ఒక పద్ధతి ఉత్తమంగా కనిపించింది.

అదేమిటంటే: ఈ రాక్షసుడి గొర్రెలు తెగ బలిసి, చాలా పెద్దవిగా వున్నాయి. వాటి ఒంటి మీద బొచ్చుకూడా బాగా పెరిగివున్నది. రూపధరుడు మూడేసి గొర్రెలను కలిపి కట్టి, మధ్య గొర్రె పొట్టకు తన అనుచరుణ్ణి ఒక్కొక్కణ్ణి చొప్పున కట్టాడు. ఈ విధంగా తన మిగిలిన అనుచరులలో ఒక్కొక్కడి కోసమూ మూడేసి గొర్రెలు ఏర్పాటు చేసి చిట్టచివరకు తాను ఒక్కడూ మిగిలాడు. గుహలో వున్న పెద్దదైన ఒక పోతును తనకుగాను అతను ప్రత్యేకించుకున్నాడు. కొంతసేపటికి తెల్లవారింది. గొర్రెలూ, మేకలూ మేతకోసం బయలుదేరాయి. గుహ ద్వారంలో కూచుని బాధతో మూలుగుతున్న రాక్షసుడు, బయటికి వెళ్ళే తన గొర్రెలనూ, మేకలనూ వీపులమీద తడవసాగాడు.

తన శత్రువులు వాటి అడుగున ఉంటారని ఆ మూఢుడికి తట్టలేదు. తన అనుచరులంతా





నిలబడ్డాడు. తరవాత అతను తన అనుచరులను ఒక్కొక్కరినే కట్లువిప్పి గొర్రెలనుంచి విడిపించాడు. ఈవిధంగా రూపధరుడి చాకచక్యంవల్ల రాక్షసుడి వాతపడకుండా ప్రాణాలతో బయటపడిన గ్రీకులు వేగంగా పరుగెత్తి తీరానతమకోసం వేచి వున్న నౌకను చేరుకున్నారు.

రూపధరుడూ, మిగిలిన పన్నెండు మందీ ఏమైపోయారో అని ఆందోళన చెందుతూ నౌకలో కనిపెట్టుకునివున్న వారు, జరిగిన సంగతి తెలుసుకుని, రాక్షసుడికి ఆహారమైపోయిన తమ అనుచరులకోసం పెద్దపెట్టున శోకాలు పెట్టసాగారు.

రూపధరుడు వారి శోకాన్ని వారించుతూ, "ఇది శోకించటానికి సమయంకాదు. మనకు వ్యవధి లేదు.అందినన్ని గొర్రెలనూ, మేకలనూ పట్టుకురండి. మనం బయలుదేరి పోదాం!" అన్నాడు. రూపధరుడి అనుచరులు అలాగే చేసి నౌకను సముద్రంమీదికితీసుకుపోసాగారు.

నౌక తీరం వదిలి కొంత దూరం వెళ్లింది. అప్పుడు రూపధరుడు రాక్షసుడి గుహకేసి తిరిగి ఎలుగెత్తి ఇలా కేక పెట్టాడు:

"ఒరీ పాపాత్ముడా! నేనూ నా అనుచరులూ, నీకు లొంగుతా మనుకున్నావురా? అతిథులను చంపి తిన్నందుకు నీకు తగిన శాస్తి జరిగింది! ఇకనైనా బుద్ధితెచ్చుకోరా!"

ఈ కేక రాక్షసుడికి వినిపించింది. వాడు కోపావేశంతో ఒక పెద్ద కొండరాయిని, మట్టి

దాటి వెళ్లాక, రూపధరుడు తనకోసం ప్రత్యేకించుకున్న గొర్రె అడుగుభాగాన, దాని బొచ్చును గట్టిగాపట్టుకునివుండి,దానితోబాటు బయటికి వచ్చాడు. ద్వారంవద్ద రాక్షసుడుఆగొర్రె పొట్టేలును కూడా వీపుమీదతడివి,"రోజూ అన్నిటి కన్నముందువెళ్ళేదానివి,ఇవాళ అన్నిటికన్న వెనకపడ్డావేమే, సోమరిపోతా? దుర్మార్గుడైన ఉత్తుత్తమనిషి నీ యజమానిని తప్పతాగించి,కన్నుపొడిచి గుడ్డివాణ్ణి చేశాడన్నవిచారంతోకుంగిపోతున్నావా?వాణ్ణి తగిన విధంగా నేను శిక్షిస్తాలే!దిగులుపడకు!"అంటూ దానిని బయటికి వెళ్ళిపోనిచ్చాడు.

గొర్రెపోతు ఆగుహను దాటి కొంతదూరం వెళ్లాక రూపధరుడుదానిని వదిలిపెట్టి లేచి

పెళ్లను విరిచినట్టువిరిచి, రూపధరుడి గొంతు వినిపించిన దిక్కుగావిసిరాడు. ఈ రాయి రూపధరుడి నౌకకంటె దూరంగావెళ్లిపడింది. అది పడిన చోట బ్రహ్మాండమైన అల బయలు దేరి, రూపధరుడి నౌకను మళ్లీ తీరానికేసి తోసుకురాసాగింది.

రూపధరుడు ఆదుర్దాగాగడవేసినౌకను మళ్లీ సముద్రంవేపు తోస్తూ, తెడ్లు జోరుగా వెయ్య మనితన అనుచరులకు కళ్లతో సైగ చేశాడు. ఈసారి నౌక పూర్వం కన్న రెట్టింపు దూరం వెళ్లాక రూపధరుడు మళ్ళీ రాక్షసుణ్ణి కవ్వించ టానికి ఉపక్రమించాడు. భయ పడిపోయిన అతని అనుచరులు ఊరుకోమని ఎంతగానో ప్రాథేయపడ్డారు. కాని అతను వారి మాట లక్ష్యపెట్టలేదు.పట్టరాని ఉత్సాహంతో ఎలు గెత్తి ఈ విధంగా అన్నాడు:

"ఓరీ రాక్షసాధమా! నీ కన్ను పొగొట్టిన దెవరని ఎవరైనా అడిగితే, ఆ పని చేసినవాడు రూపధరుడని చెప్పు! వాడు ట్రోయ్‌ని జయిం చిన వీరుడని చెప్పు! వాడిది ఇథకాదేశమని చెప్పు!"

ఈసారి రాక్షసుడు మరొక పెద్ద కొండరాయి విరిచి తన బలంకొద్దీ గురిగావిసిరాడు.అది రూపధరుడి నౌకకు చాలా సమీపంగా వచ్చి పడింది. అయితే ఈసారి దానినుంచి బయలు దేరిన అల రూపధరుడినౌకను తీరానికి మరింత దూరంగా తీసుకుపోయింది.త్వరలోనే రూపధరుడూ అతని అనుచరులూ మిగిలిన నౌకలను చేరుకున్నారు. ఆ నౌకలలో వుండిన గ్రీకులు తమ అనుచరుల క్షేమం కోసంఎంతో బెంగపడి వున్నారు. వారికిప్పుడు పరమా నందం కలిగింది. కాని రాక్షసుడికి ఆహారమై పోయిన వారికోసం వారంతా దుఃఖించారు.

తరవాత రూపధరుడు తెచ్చిన గొర్రెలను చంపిఅందరూ సమంగా పంచుకుని, తిని, ఉత్సాహంగా పానీయం తాగి హాయిగా పగ లల్లా వెళ్ళబుచ్చి, ఆ రాత్రికి తీరానేపడుకుని నిద్రపోయారు. మర్నాడు తెల్లవారుతూనే రూపధరుడు, నౌకలన్నీ లంగరు ఎత్తి ప్రయా ణం సాగించవలసిందిగా ఉత్తరు విచ్చాడు. అవన్నీ సముద్రం మీద మళ్ళీ వేగంగా బయలుదేరాయి. — (ఇంకావుంది)



# చందమామ కబుర్లు

## జంతువుల సామర్థ్యం!

అమెరికా ఓరిగాన్‌లోని 'క్రేటర్ లేక్ నేషనల్ పార్క్'లో జూన్ 19వ తేదీ ఫ్రాంక్ మిల్లర్ అనే యువకుడు తన స్నేహితురాలితో కలిసి పచార్లు చేస్తున్నాడు. వాళ్ళవెంట ఐదేళ్ళ 'బేర్' అనే కుక్క ఉన్నది. అది కూడా కాస్సేపు తిరిగి వస్తుంది కదా అని స్నేహితురాలు దానిని వదిలిపెట్టింది. ఆ కుక్క మంచు కప్పిన తటాకం



గట్టుమీద పరుగులు తీస్తూ కాళ్ళు జారి 40 అడుగుల లోతు అగాథంలో పడిపోయింది. దాని జాడ కనిపించకపోయేసరికి, మిల్లర్ దానికి సంబంధించిన ఆటవస్తువులను కూడా అగాథంలో పడవేసి, స్నేహితురాలితో కలిసి విచారంగా ఇంటిముఖం పట్టాడు. అయితే ఒక వారంతర్వాత ఆ కుక్క పక్క గ్రామంలో క్షేమంగా కనిపించింది. అగాథం అంచుకు దారి కనుగొనడానికి ఆ కుక్క 29 కి.మీ. దూరం నడిచి ఉంటుందని తెలియ వచ్చింది. ఈ సంఘటనను గురించి చెబుతూ, "జంతువుల సామర్థ్యం గొప్పది. అవి చేయలేని పని అంటూ లేదు!" అన్నాడు ఆ పార్క్ అధికారి.

## తీరని విచారం!

కేరళ అలెప్పీ సమీపంలోని మాంథార్ గ్రామ వాసి అయిన సునీల్‌కు పిల్లుల్ని పెంచడమంటే మహాఇష్టం. అతని దగ్గర తొమ్మిది పిల్లులుండేవి. వాటిలో అమ్మణి అనే పిల్లి అంటే ఆ గ్రామంలో అందరికీ తెలుసు. అది ఎంతో అణకువగానూ, క్రమశిక్షణతోనూ ఉండేది. దానికి పెట్టే బిస్కట్లు, పచ్చిమిరపకాయలు తప్ప ఎదుట చేపలు ఉన్నా సరే ముట్టుకునేది కాదు. ఆ పిల్లిని గురించి గ్రామ ప్రజలు వింతగా చెప్పుకునేవాళ్ళు. దానిని గురించిన వార్త ఫొటోతో సహా ఇటీవల ఒక ప్రాంతీయ పత్రికలోవచ్చింది.మరురోజేఅది చచ్చి పోయింది. రెండు రోజుల తరవాత సునీల్ తండ్రి మరణించాడు. మిగతా ఎనిమిది పిల్లులూ ఒకటి వెనక ఒకటి, రెండు వారాలలోగా చచ్చి పోయాయి. ఆ విచారం నుంచి ఇంకా కోలుకో లేని సునీల్ "ఇకపై పిల్లుల్ని పెంచను!" అంటు న్నాడు మిత్రులతో.

## కృత్రిమమైన గుండెకాయ!

టోక్యో విశ్వవిద్యాలయ వైద్య విభాగం ఇటీవల పరోక్షంగా ఒక ప్రపంచ రికార్డును సృష్టించింది. అక్కడి వైద్యనిపుణులు ఐదేళ్ళ మేకకు 'కృత్రిమమైన గుండెకాయ'ను అమర్చారు. 400 రోజుల తరవాత కూడా ఆ మేక ఎంతో ఆరోగ్యంగా ఉన్నది. ఇంతకుముందు అంటే, 1992వ సం॥లో కూడా ఒక అమెరికా విశ్వవిద్యాలయంలో ఈ ప్రయత్నం జరిగింది. అప్పుడు కృత్రిమమైన గుండె అమర్చబడిన జంతువు 88 రోజులు మాత్రమే జీవించింది!




# వాగ్దానభంగం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి,చెట్టుపైనుంచిశవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, “రాజా, నిన్ను ఎవరో అతి జాలిగా అర్థించి మనసు కరిగేలాచేసి, కఠోరమైన ఇక్కట్లకు గురి చేస్తున్నారని, నా అనుమానం. అలాకాకపోతే – మహారాజువైన నీకు, ఇలా అర్ధరాత్రి అపరాత్రి వేళల్లో శ్మశానాలవెంట తిరిగే అవసరం ఏం వుంటుంది! అయితే, మనషుల్లో అధిక సంఖ్యాకులు కరుడుకట్టిన స్వార్థపరులైవుంటారు.తమపని నెరవేరాక, చేసిన వాగ్దానాలు ఇట్టే మరిచిపోతారు. ఇందుకు, ఇంద్రపురి మహారాణి ఇందుమతి చక్కని ఉదాహరణ. ఆమె కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,”అంటూఇలాచెప్పసాగాడు:

ఇందుమతి, ఇంద్రపురి మహారాజు జయకేతుడి పట్టపురాణి. వారికి వివాహం జరిగి

## బేతాళ కథలు



పన్నెండేళ్ళయినా సంతానం లేదు. సంతానం కోసం ఇందుమతి చేయని పూజలేదు. దర్శించని పుణ్యక్షేత్రం లేదు. ఆమె ప్రతి శనివారం రోజంతా ఉపవాసంవుండి,సాయంత్రం నగర శివార్లలో కొండ మీదవున్న కార్తికేయుడి ఆలయానికెళ్ళి, సంతానం కోసం ప్రార్థనలు జరిపేది. అది ముగిశాక, ఆలయం వెనక రావి చెట్టు కిందవున్న పెద్ద పాముపుట్టను కూడా పూజిస్తూండేది.

ఆమె ఒక శనివారం నాడు ఆలయంలో ప్రార్థనలు జరిపి, ప్రసాదం ఇస్తున్న పూజారితో, "నిండుమనసుతో ఒక్కసారి ఈ స్వామిని కొలిచినా, సంతానభాగ్యం కలుగుతుందని లోకులు చెప్పుకుంటారు. నేను మూడు వందల శనివారాలు క్రమం తప్పకుండా, స్వామిని పూజిస్తున్నాను. ఫలితం మాత్రం లేదు!" అన్నది బాధపడుతూ.

దానికి పూజారి, "మహారాణీ, నిరుత్సాహపడకండి! దేనికైనా సమయం కాలం కలిసిరావాలి. ఏదో ఒకనాడు, ఈ స్వామి తప్పక మిమ్మల్ని కరుణిస్తాడు," అన్నాడు ధైర్యంచెబుతూ.

ఇందుమతి భారంగా నిట్టూర్చి, ఆలయం వెనకవున్న పుట్టలో పాలుపోసి,పుట్టను పసుపూ కుంకుమలతోపూజించి,వెనుతిరుగుతూండగా, "ఇందుమతీ! ఇలారా," అంటూ ఎవరో పిలిచారు. ఆమె ఆశ్చర్యపడి తలతిప్పి చూసింది. రావిచెట్టుకు కొద్దిదూరంలో వున్న ఒక రాతి బండమీద,జడలుకట్టినజుట్టుతో,పాత బట్టలతోబైరాగిలావున్నఒకమనిషికూర్చునివున్నాడు.

ఒక అనామకుడు తననుపేరుపెట్టి పిలిచినందుకు, ఇందుమతి ఆగ్రహపడుతూండగా, బైరాగి వికారంగా నవ్వుతూ, "కోపించకు, ఇందుమతీ! సంతానం కోసం నువ్వు తపించిపోతున్నావని తెలిసి, నిన్ను అనుగ్రహించడానికి వచ్చాను!" అన్నాడు.

తన మనసులోని ఆవేదనను గ్రహించిన ఆబైరాగి,సామాన్యుడుకాడనిభావించి ఇందుమతి అతణ్ణి సమీపించి పాదాలు తాకి,"స్వామీ! మీరు సామాన్యులు కారు. అనుగ్రహించండి!" అన్నది.

బైరాగి తన పక్కనే వున్న ఒక సంచీని ఆమెకు చూపుతూ,"అందులో అరటి పళ్ళు

వున్నాయి.కేవలం ఒకపండును మాత్రం తీసుకుని భుజించు. నీ కోరిక నెరవేరుతుంది," అన్నాడు.

ఇందుమతి ఆత్రంగా సంచిలో చెయ్యి పెట్టింది. సంచీనిండుగా అరటిపళ్ళున్నాయి. కానీ వాటిలో కొన్ని సన్నగానూ, మరికొన్ని బాగా పండిపోయి మెత్తగానూ వున్నాయి. ఆమె — ఆరోగ్యవంతుడైన బాబు కావాలి, అనుకుంటూ,సంచీ అడుగు నుంచి బాగా లావుగా వున్న ఒక అరటిపండును తీసి కళ్ళ కద్దుకుని తొక్కవలిచింది. అప్పుడది కవల అరటిపండని ఆమెకు తెలిసింది.

ఇందుమతి ఆ అరటి పండును తింటూండగా, బైరాగి మౌనంగాలేచి సంచీతీసుకుని, వెనకవైపున నిటారుగావున్న కొండ దిగి వెళ్ళిపోయాడు.

ఆరాత్రి ఆమె జరిగిందంతాభర్తకుచెప్పి, "ఆయన తప్పక ఎవరో మహానుభావుడైవుంటాడు!" అన్నది. దానికి జయకేతుడు నవ్వి, "నువ్వుఎంతమందిమహానుభావుల ఆశీర్వాదాలుపొందలేదు. ఏమైనా,ఈ జన్మకు మనకు సంతానప్రాప్తి వున్నట్టుకనబడదు," అన్నాడు.

అయితే—ఇదిజరిగిన మూడు మాసాలకే, రాణి గర్భవతి అని రాజవైద్యులు నిర్ధారించారు. ఇందుమతి, జయకేతుల ఆనందానికి అవధులులేవు!

తొమ్మిది నెలలు నిండాక, ఇందుమతి ప్రసవించింది. కవలలు పుట్టారు. అయితే,



ఇద్దరికీ ఆమె తిన్న అరటిపండులా శరీర భాగాలు కలుసుకుపోయి వున్నాయి.

"ఆరు మాసాలలోగా శస్త్రచికిత్స చేసి పిల్లల్ని విడదీయకపోతే, వాళ్ళ ప్రాణాలకే ముప్పు!"అంటూ పదిరోజుల తర్వాత అసలు విషయం బయటపెట్టారు రాజవైద్యులు.

"అంతకాలం ఆగడందేనికి?ఇప్పుడే, ఆ శస్త్ర చికిత్స ఏదో చేయండి!"అన్నాడు రాజు.

రాజవైద్యులు విచారంగా, "మహారాజా! ఆ శస్త్ర చికిత్స ఎంతో అనుభవజ్ఞులు చేయవలసింది. మన రాజ్యంలో ఆ చికిత్స చేయగల సమర్థులు లేరు", అన్నారు.

" మన రాజ్యంలో లేరు, సరే! మరెక్కడున్నారు? పొరుగురాజ్యాల్లో ఎక్కడవున్నా, పెద్ద

పారితోషికం ఇస్తామని చెప్పి ఆహ్వానించండి," అన్నది ఇందుమతి.

రాజవైద్యులుకొంచెంసేపుతటపటాయించి, "మహారాణీ! మేమెరిగినంతలో, ఈ శస్త్రచికిత్స చేయగల వాడు. అశ్వనీదత్తుడు మాత్రమే!" అన్నారు.

అశ్వనీదత్తుడి పేరువింటూనే రాజు జయ కేతుడు చిరాకుపడుతూ, "మన పరమ శత్రు రాజ్యంచంద్రగిరిఆస్థానవైద్యుడా? నాసంతానం మరణించినా బాధ లేదుకానీ, ఆ ఆస్థాన వైద్యుడికోసం, ద్రోహి రుద్రసేనుడి ముందు దేహీ అంటూ, నాకంఠంలో ప్రాణం వుండగా అర్థించలేను," అన్నాడు.

జయకేతుడికి పుత్రప్రాప్తి గురించి తెలిసి, ఇరుగు పొరుగు రాజ్యాలన్నింటినుంచీ, అభి నందన సందేశాలందాయి. చంద్రగిరి రాజు రుద్రసేనుడు మాత్రం, "ఇద్దరూ మగపిల్లలైతే నేం! అతుక్కుపోయివున్నారటగా? అయ్యో, పాపం!" అంటూ సంతాపసందేశం పంపాడు.

ఇది జయకేతుడికి అమితమైన ఆగ్రహం తెప్పించింది. బిడ్డల రక్షణకోసం, రుద్రసేనుడి సాయం అడగడం అవసరం అని భర్తకు నచ్చచెప్పచూసింది, ఇందుమతి. కాని, జయ కేతుడు, "ఈ విషయంలో నా మీద ఒత్తిడి చేయడాన్ని సహించను!" అన్నాడు తీవ్రంగా.

దానితో, భర్త ద్వారా పని సానుకూలం కాదని గ్రహించిన ఇందుమతి, తనే స్వయంగా వెళ్ళి అశ్వనీదత్తుణ్ణి శస్త్రచికిత్స చేసేందుకు తీసుకురావాలని నిర్ణయించుకున్నది. ఆ తర్వాత ఆమె కవలల్ని వైద్యులపర్యవేక్షణలో



వుంచి, పుట్టింటికి వెళ్ళివస్తానని భర్తకు చెప్పింది.ఒక దాసిని వెంట బెట్టుకుని,మారు వేషంలో రెండు రాత్రులుకొండదారుల వెంట శ్రమపడి ప్రయాణం చేసి చంద్రగిరి చేరు కున్నది.

చంద్రగిరిలో రాజవైద్యుడి నివాసం కను క్కోవడం, ఆమెకేమీ కష్టం కాలేదు. ఆసరికి చీకటి పడింది. అశ్వనీదత్తుడు బ్రహ్మచారి. ఆ సమయంలో అతడు స్వయంగా వంట చేసుకుంటున్నాడు. తలుపు తట్టిన శబ్దం విని అతడు స్వయంగా వచ్చి తలుపుతీశాడు.

"ఎంతో ప్రయాసకోర్చి, చాలా దూరం నుంచి వచ్చాను.నాకు సంతానభిక్ష పెట్టగల వారు మీరు మాత్రమే!" అంటూ ఇందుమతి రెండు చేతులూ జోడించింది. ఆమె కళ్ళ నుంచి జలజలా నీళ్ళుకారాయి.

"దుఃఖించకు, తల్లీ! దూరంనుంచి వచ్చా నంటున్నావు, ముందు భోజనం చెయ్యి," అంటూ అశ్వనీదత్తుడు, రాణీకీ, వెంటవున్న దాసీకీ అరటి ఆకుల్లో వడ్డన చేశాడు.

భోజనం చేశాక ఇందుమతి, తన కవల పిల్లలకు చేయవలసిన శస్త్ర చికిత్స గురించి, అశ్వనీదత్తుడికి చెప్పింది. అంతా విన్న అశ్వ నీదత్తుడు, "నీ పిల్లలకు వచ్చిన ప్రమాదం ఏమీలేదు. నేను శస్త్రచికిత్స చేస్తాను. ఇంతకూ మీఊరు ఇక్కడికెంత దూరం?"అనిఅడిగాడు.

"మాది ఇంద్రపురి.నేను ఇంద్రపురి మహా రాణిని,"అన్నది ఇందుమతి ఏమాత్రం తొణ క్కుండా. అశ్వనీదత్తుడు ఉలిక్కిపడ్డాడు. అతడి ముఖం వివర్ణమైంది."ఈ శస్త్రచికిత్స





జరిగిన మరుక్షణం, నాతల చంద్రగిరి కోట కొమ్ము నుంచి వేలాడగలదు. ఈసంగతి మీకు తెలియదనుకోను!" అన్నాడు.

"మీ ప్రాణాలకేమీ హాని జరగదని వాగ్దానం చేస్తున్నాను. నా మాట నమ్మండి. నా ఆశలు వమ్ము చేయవద్దు," అంటూ ప్రాథేయపడింది ఇందుమతి.

అశ్వనీదత్తుడు కాసేపు ఆలోచించి, "సరే, పదండి!" అంటూ ఇంటికి తాళం వేశాడు.

వాళ్ళు ఇంద్రపురి చేరిన మరుసటి రోజే శస్త్ర చికిత్స చేసి, కవలలిద్దరినీ వేరు చేశాడు, అశ్వనీదత్తుడు. శస్త్రచికిత్స విజయ వంతం అయింది. పిల్లలిద్దరూ ఆరోగ్యంగా వున్నారు.

ఆరోజే, రాజదంపతుల ఆజ్ఞానుసారం, దేశమంతటా ఒక చాటింపు జరిగింది. దాని సారాంశం — శస్త్రచికిత్సతో కవలపిల్లల్ని విడదీసి, ఇంద్రపురి రాజవంశాన్ని నిలబెట్టిన మహానుభావుడు, చంద్రగిరి ఆస్థాన వైద్యుడైన అశ్వనీదత్తుడు! ఆయనకు రాజదంపతులతో పాటు, దేశప్రజలందరూ తమ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నారు.

మర్నాటికి ఈవార్త ఇరుగుపొరుగు రాజ్యాలన్నింటికీ పాకిపోయింది.

అశ్వనీదత్తుడు, ఇందుమతి ఇవ్వజూపిన కానుకలను నిరాకరిస్తూ, "మహారాణీ! మీరు చేసిన మేలుకు కృతజ్ఞతలు!" అనిచెప్పి, తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఇందుమతి చేసింది వాగ్దానభంగం కాదా? ఎట్టి పరిస్థితుల్లోనూ అశ్వనీదత్తుడికి ప్రాణహాని జరగదని, ఆమె మాట ఇచ్చింది. అటువంటప్పుడు, కవలలకు శస్త్రచికిత్స చేసిన అతడి పేరు లోకానికి వెల్లడించడం అంటే, అతడి ప్రాణాలకు ప్రమాదం తెచ్చి పెట్టడమే కదా? ఇది కృతఘ్నత అనిపించుకోదా? అసలు ప్రమాదకరమైనపని అని తెలిసీ, అశ్వనీదత్తుడు ఆమె అభ్యర్థనను ఎందుకు మన్నించాడు? చివరికి, ఆమె తనకు మేలు చేసిందని, ఎందుకన్నాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అశ్వనీదత్తుడు వైద్యవృత్తికే జీవితాన్ని అంకితంచేసిన గొప్ప వ్యక్తి. తన వృత్తికి ఎలాంటి ఆటంకం కలగ కూడదనే, అతడు వివాహం కూడా చేసుకో లేదు. నిజమైన వైద్యుడు,వ్యాధితో ప్రాణాపద లోవున్న బద్ధశత్రువుకైనా ప్రాణం పోయడం, తన ధర్మంగా భావిస్తాడు. ఈ కారణం వల్లనే, అతడు ప్రాణాలకు తెగించి తనకు తెలిసిన వైద్యం చేయడానికి, ఇందుమతి వెంట బయలుదేరాడు. పోతే, గొప్ప వైద్యశాస్త్ర పరిజ్ఞానంతోపాటు,ఎంతో నేర్పూ చాకచక్యాలు కలవాడే, అలాటి శస్త్రచికిత్స చేయగలడు. అలాంటివాడు,చుట్టుపక్కలగల అన్ని రాజ్యాలలోనూ ఒక్క అశ్వనీదత్తుడు మాత్రమే! వైద్యుడి పేరు గోప్యంగా వుంచినంత మాత్రాన ఆ శస్త్రచికిత్స చేసింది అశ్వనీదత్తుడని, చంద్రగిరి రాజు రుద్రసేనుడు గ్రహించక పోడు. శత్రువంశాన్ని నిలబెట్టినందుకు తప్పక అతణ్ణి కఠినంగా శిక్షిస్తాడు. ఈ ప్రమాదాన్ని శంకించే ఇందుమతి, అశ్వనీదత్తుడి పేరు అందరికీ తెలిసేలా వెల్లడించింది. ఇలా చేయడంవల్ల,వృత్తిధర్మం కోసం ప్రాణాలు పణంగా పెట్టి, శత్రురాజ్యంలో నీరాజనాలు అందుకుని, తన రాజ్యప్రతిష్ఠను ఇనుమడింప చేసిన అశ్వనీదత్తుడిని శిక్షించడానికి చంద్రగిరి రాజుకు ధైర్యంచాలదు. ఇలాంటి పరిస్థితుల్లో, అశ్వనీదత్తుడికి ఏమైనా ఆపద సంభవిస్తే, ఇరుగుపొరుగు రాజ్యాలనుంచే కాక, తన దేశ ప్రజలనుంచి కూడా ప్రతిఘటన రావచ్చు. కాబట్టి,ఇష్టం లేకపోయినా లోకానికి వెరిచి, అశ్వనీదత్తుడి విజయాన్ని అభినందించక తప్పదు,చంద్రగిరి రాజుకు! అందుకే, సున్నితమైన ఈ సమస్యను ఎంతో వివేకంతో పరిష్కరించినఇందుమతికి,అశ్వనీదత్తుడు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ఈకారణాల వల్ల, ఇందుమతి వాగ్దానభంగం చేసిందని కాని, కృతఘ్నురాలుగా ప్రవర్తించిందని గాని అనడం సరికాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం: మాచిరాజు కామేశ్వరరావు రచన]



# నిజమైన రాజనర్తకి

అవంతి నగరానికీ, కుసుమపురానికీ సత్సంబంధాలుండేవి. అవంతి రాజనర్తకి కౌముది, రాజాజ్ఞను పురస్కరించుకుని కుసుమపురానికి వెళ్ళి, అక్కడ జరిగిన ఉత్సవాల్లో నాట్యం చేసింది. ఆమె అవంతి నగరానికి తిరిగివస్తూ, మార్గమధ్యంలోని అడవులలో వున్న బందిపోట్లకు దొరికిపోయింది.కౌముది వెంటవున్న సైనికులు,బందిపోట్లను ఎదిరించి పోరాడలేక లొంగిపోయారు.

బందిపోట్లు, రాజనర్తకిని తమ నాయకుడి వద్దకు తీసుకుపోయారు. ఆమె, బందిపోట్ల నాయకుడితో, "నేనెవరనుకుంటున్నారు? అవంతి రాజనర్తకిని! మీరు నన్ను బంధించారని మహారాజుకు తప్పక తెలుస్తుంది. ఆయన సైన్యాన్ని పంపి మిమ్మల్ని సర్వనాశనం చేస్తారు," అన్నది.

బందిపోట్లు ఆమె మాటలు నమ్మలేదు. ఏదో సాధారణ నగరవాసి అనుకున్నారు. వాళ్ళలో ఒకడు, "నువ్వు రాజనర్తకివా? ఇంకానయం సాక్షాత్తు మహారాణినే అనలేదు!" అన్నాడు.

ఇదివిని అందరూ నవ్వారు. బందిపోట్లనాయకుడామెతో, "సరే, నువ్వు మాముందు నాట్యం చేసి, రాజనర్తకినని నిరూపించుకో," అన్నాడు.

ఇందుకు రాజనర్తకి పట్టరాని కోపంతో , "ఛీ, మీలాంటి అడవిమనుషుల ముందు నాట్యం చేయడమా? నేను నాట్యం చేసేది రాజాస్థానాల్లోనే. నా ప్రాణం తీసినా సరే నేనిక్కడ నాట్యం చెయ్యను," అన్నది.

ఈ జవాబు వింటూనే బందిపోట్ల నాయకుడు ఉలిక్కిపడి, "ఔను, ఈమె నిస్సందేహంగా రాజనర్తకే! వృత్తివిలువ తెలిసిన నిజమైన కళాకారిణి. ఈమెనూ, ఈమె వెంట వచ్చిన పరివారాన్నీ సగౌరవంగా అడవి దాటించండి!" అని తన అనుచరులను ఆజ్ఞాపించాడు. — ఆర్. సత్య



## మనదేశపు కోటలు : 7

# దక్కనులోని బలమైన కోటలు

రచన : మీరా ఉగ్రా ◆ చిత్రాలు : అరిత్రా

దేవగిరి కోటను దక్షిణ భారతదేశపు సింహద్వారం అని అంటారు. దక్కను పీఠభూమి మధ్య, కీలక స్థానంలో నల్ల కొండరాళ్ళ మీద దృఢంగా, ఎంతో గంభీరంగా నిలబడి ఉండడం వల్ల దీనికాపేరు వచ్చింది.

నగరం చుట్టూ బలమైన ప్రహరీగోడ ఉండేది. అంతేకాదు, నగరానికీ, కోట ఉన్న కొండకూ మధ్య అంటే కొండ చుట్టూ దృఢమైన చాలా గోడలూ, మూడు అగడ్తలూ ఉండేవి. లోపలి అగడ్తలోని నీటి మట్టాన్ని కావలసిన మేరకు పెంచడానికీ, తగ్గించడానికీ తగిన ఏర్పాట్లు ఉండేవి. శత్రువులు ముట్టడించినప్పుడు నీటిమట్టాన్ని పెంచి, అగడ్త మీదుగా ఉన్న వంతెనను నీళ్ళలో మునిగిపోయేలా చేసేవారు. ఒకవేళ శత్రువులు వంతెన దాటి లోపలికివచ్చినా,తిన్నగాసొరంగమార్గంలోప్రవేశించవలసిందే.

దేవగిరికోట ప్రాచీన పర్యవేక్షకశిఖరం

రాజప్రాసాదానికి ఆ సొరంగమార్గం ఒక్కటే దారి. అది చీకటిమయంగానూ, అపాయకరంగానూ ఉండేది. సైనికులు గోడ చాటు గూళ్ళ నుంచి, శత్రువులను తెగనరికేవారు. శత్రువులు ఎక్కువ సంఖ్యలో ఉన్నట్టయితే సొరంగాన్ని పొగతో నింపి, శత్రువులకు ఊపిరాడకుండా చేసి చంపేవారు.

సొరంగమార్గం మధ్య మూడు పాయలుగా చీలిపోయేది. అందులో ఒకటి మాత్రమే వెలుపలికి వెళ్ళేది. మిగతా రెండుదారులూ, వాటిగుండా వెళ్ళేవారిని లోతైన పల్లాలకు తోసి, దారుణమరణానికి గురిచేసేవి.



దౌలతాబాద్‌కోట స్వరూపచిత్రం



సొరంగమార్గం నుంచి బయటపడినా, రాజకుటుంబం, ప్రముఖులు నివసించే రాజభవనం చేరుకోవడానికి అనేక అవరోధాలను ఎదుర్కోవలసి వచ్చేది.

ఈ కోట క్రీ.శ. రెండవ శతాబ్దానికి చెందిన శాతవాహనుల నాటిది. యాదవులు వంద సంవత్సరాలకుపైగా ఇక్కడి నుంచి పరిపాలన సాగించారు. వారి నుంచి దీనిని క్రీ.శ. 1294వసంలో అల్లాఉద్దీన్ ఖిల్జీ వశపరచుకున్నాడు. సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్ ఈ కోటను చూసినప్పుడు, భూమండలంలో ఇదే సురక్షితమైన స్థలంగా భావించాడు. అందుకే కొంతకాలం దేవగిరిని తన రాజధానిగా చేసుకున్నాడు. దీనిని ఇప్పుడు దౌలతాబాద్ అని పిలుస్తారు.

తుగ్లక్‌కు సామంతుడయిన బహ్మన్‌షా, గుల్బర్గాను తన రాజధానిగా చేసుకుని బహ్మనీ వంశాన్ని స్థాపించాడు.

బహ్మన్ షా వంశస్థులు తమ రాజధానిని, మూడు

దౌలతాబాద్ కోట చాంద్ మీనార్

బీదర్ కోట ప్రహరీ గోడలు, అగడ్త

గుల్బర్గా కోట ఆవరణ

అగడ్తలతో చాలా బలమైన కోటగల సురక్షితమైన బీదర్‌కు మార్చారు.

దక్షిణ భారతదేశానికి చెందిన అతి ప్రాచీనమైన ముస్లిం కట్టడాలు బీదర్‌లో ఉన్నాయి.

15వ శతాబ్దాంతానికి బహ్మనీ సామ్రాజ్యపతనం ఆరంభమయింది. 1490వ సం॥లో యూసుఫ్ అదిల్ ఖాన్ బీజాపూర్ నుంచి విడిపోయి అదిల్ షాహీ వంశాన్ని స్థాపించాడు. ఈ వంశానికి చెందిన అతి ప్రసిద్ధుడైన రాజు మహ్మద్ అదిల్ షా గోరీని గోల్‌గుంబజ్ అనిఅంటారు. దీని గుమ్మటం ప్రపంచంలోని అతి పెద్ద గుమ్మటాలలో రెండవది.



▲ గోల్ గుంబజ్. ఈ భవనంలోపల ఒక్కసారి చప్పట్లు కొట్టినట్టయితే ఆ శబ్దం పదిసార్లకుపైగా ప్రతిధ్వనిస్తుంది. చేతిగడియారాన్ని ఒక గోడకు ఆనించినట్టయితే, దాని నుంచి వచ్చే టిక్ టిక్ శబ్దం ఎదుట ఉన్న గోడనుంచి వినిపిస్తుంది.

*తత్వజ్ఞాని-కవి-సంగీతవేత్త అయిన రెండవ ఇబ్రహీం అలీ అదిల్ షా నిర్మించిన ఇబ్రహీం రోజా. మొదటిది ప్రార్థనా భవనం, రెండవది సుల్తాన్ గోరీ.* ▼

దూరంలో ఉన్న నదుల నుంచి, కొల నుల నుంచినీటినిభూమికిఅడుగున అమ ర్చినగొట్టాలగుండా కోటలకు సరఫరా చేసే అద్భుతవిధానాన్నిఅదిల్‌షారూపొందించాడు.

అహ్మద్‌నగర్ కోట

అహ్మద్ నిజామ్‌షా అనే మరొక సామంతు బహ్మనీ సామ్రాజ్యం నుంచి విడిపోయి, అహ్మద్‌నగర్ రాజధానిగా నిజాంషాహీ వంశాన్ని స్థాపించాడు.

1595వ సం॥ డిసెంబర్ నెలలో మొగలులు అహ్మద్‌నగర్ కోటను ముట్టడించారు. అప్పుడు తన సోదరుడికొడుకుప్రతినిధిగా రాజ్యమేలుతూన్న చాంద్‌బీబీ దృఢంగా నిలబడి పోరాడింది. కోటలోని ఆయుధసామగ్రి అయిపోతే, చాంద్‌బీబీ ఖజానాలోని బంగారంతో ఫిరంగి గుళ్ళు తయారు చేయించిందని చెబుతారు.



చాంద్ బీబీ

1596 ఫిబ్రవరిలో జరిగిన ఒప్పందం ద్వారా అక్కడ తాత్కాలిక శాంతి ఏర్పడింది.

భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో అహ్మద్ నగర్ కోటను జైలుగా ఉపయోగించారు. సర్దార్‌వల్లభాయ్ పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, అబుల్ కలామ్ ఆజాద్, ఆచార్యకృప లానీ వంటి పలువురు సుప్రసిద్ధ నాయకులు అహ్మదనగర్ కోటలో జైలుశిక్ష అనుభ వించారు. ఈ కోటజైలులో ఉన్నప్పుడే జవహర్‌లాల్‌నెహ్రూ 'భారతదర్శనం' అనే తన సుప్రసిద్ధ గ్రంథం రచించాడు.




# పిశాచం చేయలేని పని

సోమవరం అనే గ్రామంలో, శివుడనే వాడుండే వాడు. వాడిపదహారోఏటతండ్రి చనిపోయాడు. శివుడు తెలివైనవాడు, కాని వట్టి సోమరి పోతు.

ఒకనాడు వాడి తల్లి, "నాయనా, శివా! నువ్వు పొలం సంగతి పట్టించుకోకపోతే, అది బీడు పడిపోతుంది. మనకు రోజు గడవడమే కష్టమవుతుంది," అన్నది.

దీనికి శివుడు విసుగ్గా, "ఎండనక వాననక పొలం గట్ల వెంటా, గనుముల వెంటా తిర గడం, నా వల్లనవుతుందా? ఇంకేదైనా పని చేద్దామన్నా ఇచ్చేవాడెవడు? ఛీ, ఇది ఊరు కాదు వల్లకాడు!" అంటూ, విసుగ్గా ఇంట్లోంచి బయలుదేరి, తనెక్కడికి వెళుతున్నదీ ఆలో చించకుండానే, బాగా చీకటిపడే వేళకు దూరం గావున్న అడవి చేరాడు.

ఆసరికి వాడికి కాళ్ళు పీకటంతో వాడొక పెద్ద చింత చెట్టు కింద ఉస్సురుమంటూ కూర్చున్నాడు. ఇప్పటి స్థితి తలుచుకుంటే ఏడుపువచ్చింది. ఏ పులో, పిశాచమో వచ్చి మింగేస్తే, అన్ని కష్టాలనుంచీ విముక్తి కలుగు తుంది, అనుకున్నాడు వాడు.

ఆ మరుక్షణంలో చెట్టు వెనక నుంచి, "ఈ దగ్గర్లో పులిలేదు, నేనున్నాను!" అన్న మాటలు శివుడికి వినిపించాయి.

శివుడు ఆశ్చర్యంగా తలతిప్పి చూసేసరికి, పిశాచం ఒకటి వికవికమని నవ్వుతూ, వాడి ముందుకు వచ్చి, "నువ్వుతలుచుకోగానే వచ్చా నని, ఆశ్చర్యంగా వుందా? నాకు సోమరిపోతు లంటే మహాయిష్టం!" అన్నది.

పిశాచాన్ని చూసి శివుడు ముందు భయపడి నా, అది సోమరిపోతు అనేసరికి కోపంతెచ్చు కుని, "సరే, నేను సోమరిపోతునే! నువ్వేం సాయం చెయ్యగలవు?" అన్నాడు.

"నీకేదికావాలన్నా యిస్తాను. కాని, ముందు నాషరతులకు ఒప్పుకోవాలి?" అన్నది పిశాచం.

రామవరపు గణేశ్వరరావు



దారి నీది, నా దారి నాది! ఇందుకు ఇష్ట మయితే చెప్పు," అన్నది పిశాచం.

శివుడు, పిశాచం పెట్టిన షరతుకు ఒప్పు కున్నాడు. మరుక్షణం వాడి జేబులు బంగారు నాణాలతో నిండిపోయాయి.

"నీకెప్పుడు ఏదికావాలన్నా నన్ను తలు చుకో!" అని చెప్పి, పిశాచం మాయమయింది.

శివుడు ఇంటికి వెళ్ళి జరిగినదంతా తల్లితో చెప్పి బంగారు నాణాలు ఆమెకు చూపాడు. ఆమె, వాడు పిశాచానికి బానిస అయిపోతా డన్న భయంతో శోకాలుపెట్టి, ఆ ఒప్పందాన్ని రద్దుచేసుకోమన్నది. అందుకు శివుడు ఒప్పుకో లేదు. ఆమె పట్టరాని కోపంతో వాడిని ఇంటి నుంచి బయటికి నెట్టి, తలుపులు మూసింది.

"ఏమిటా షరతులు?" అని అడిగాడు శివుడు సంశయిస్తూనే.

"ఆరేళ్ళపాటు నేను, నీకు బానిసగావుం టాను. ఏదికావాలంటే అదియిస్తాను. నువ్వు రాజభోగాలు అనుభవించవచ్చు — ఆరేళ్ళు మాత్రమే!" అన్నది పిశాచం రహస్యం చెబు తున్నట్టు.

"ఆ తర్వాత?" అని అడిగాడు శివుడు ఇందులో ఏదోమోసంవున్నదనిఅనుమానిస్తూ.

"ఆ తర్వాత, నాకు నువ్వు బానిసగా జీవి తాంతం వుంటావు. నిన్ను నాతో తీసుకెళ్తాను. అయితే, ఈలోగా నువ్వు చెప్పిన పని ఏద్దైనా నేను చేయలేకపోతే మాత్రం, మన ఒప్పం దానికి నువ్వు కట్టుబడనవసరం లేదు. నీ

శివుడు అడవికి పోయి పిశాచాన్ని తలుచు కున్నాడు. అది కనిపించగానే, "నేనీ ప్రాంతం వదిలి అడవిలో మరొకచోట వుండదలిచాను. నాకొక్క చక్కని భవనం,పనులు చేసేందుకు దాసదాసీలు, ఒక భోషాణం నిండుగా బంగారు నాణాలు కావాలి," అన్నాడు.

పిశాచం క్షణాలమీద వాడు కోరినవన్నీ సమకూర్చింది. వాడు ఒక నెలరోజులపాటు అన్ని సుఖాలూ అనుభవిస్తూ కాలం గడిపి, మరొకసారి పిశాచాన్ని తలుచుకున్నాడు. అదిరాగానే,"నేను అడవిలోతిరగడానికి ఒక ఏనుగూ,నాలుగు గుర్రాలూ కావాలి!" అన్నాడు.

పిశాచం వాటిని తెచ్చి శివుడికి అప్పగిం చింది. మరొక నెల గడిచాక వాడు, పిశాచాన్ని

తలుచుకుని,అది కనబడగానే, "ఈ అడవిలో దోపిడీ దొంగలు తిరుగుతున్నారని, నా అనుమానం. నా భవనాన్ని కాపలా కాసేం దుకు పెంపుడు కుక్కల్లా వుండే ఆరు పులులు కావాలి!" అన్నాడు.

పిశాచం వాటిని తెచ్చి భవనం ముందు కట్టివేసింది. మరొకసారి వాడు,పిశాచాన్ని తన భవనం చుట్టూ ఇరవై అడుగుల ఎత్తయిన గోడకట్టమన్నాడు, దాపులవున్న పెద్ద చెట్లను పీకి దూరంగా పాతమన్నాడు. భవనానికి తూర్పుగా పడివున్న బండరాళ్ళను ఎత్తికొండ శిఖరం మీద పెట్టిరమ్మన్నాడు. ఈ పనులతో విసిగి పోయిన పిశాచం, వాడితో,"నువ్విలా పీడిస్తావని తెలిస్తే, నీఛాయలకు కూడా వచ్చే దాన్ని కాదు. సరే, చూస్తూండు! నువ్వు నా బారిన పడకపోవు. అప్పుడు నిన్ను సలసలా కాగే నూనెలో వేసి,తర్వాత ఎర్రగా కాలే పెనంమీద వేయిస్తాను. అప్పుడు నిన్ను ఒక్క సారే తినేస్తా ననుకోకు — పదునైన కత్తితో చిన్నచిన్న ముక్కలుగా కోసి, ఆర్నెల్లపాటు ఉదయం, సాయంత్రం ఫలహారంగాతిం టాను," అన్నది పళ్ళుకొరుకుతూ.

"నేను నీకు చిక్కినప్పుడు కదా, చూద్దాం లే!" అని నవ్వేశాడు శివుడు.

ఇలా ఒక సంవత్సరం, రెండు, మూడు, నాలుగు, ఐదు సంవత్సరాలు గడిచి పోయాయి. పిశాచానికి శివుడు ఏపని చెప్పినా క్షణాలమీద చేసేది.



ఆరో సంవత్సరం రాగానే శివుడికి బెంగ పట్టుకున్నది. తను చేసిన తప్పు తెలిసొచ్చింది. ఆఖరి రోజురాత్రి,శివుడు తెగని ఆలోచన లతో భవనం నుంచి బయలుదేరి, దాపుల నున్న కొలనుగట్టున కూర్చున్నాడు. కొలనులో వున్న కప్పలు బెకబెకమంటూ అరుస్తున్నవి. వాటిలో ఒక కప్ప నీళ్ళల్లోంచి ఎగిరి వాడి మీదికి దూకి, వాడు తృళ్ళిపడి లేవబోయేం తలో కొలనులోకి గెంతింది.

ఇదిజరిగిన మరుక్షణంలో శివుడికి మెరు పులా ఒక ఆలోచన వచ్చి వాడు, "ఆహాఁ!" అంటూ లేచి నిలబడి, "ఓహోఁ! పిశాచీ, రా వేగిరం!" అని కేకపెట్టాడు. పిశాచం చెట్ల కొమ్మల్లోంచి, వాడి ముందుకుదూకింది.

"నేనిప్పుడు చెప్పబోయే పనిచేయాలి!" అన్నాడు శివుడు.

"మన ఒప్పందం ప్రకారం ఆరోసంవత్సరం ముగిసేందుకు, ఇంకా ఒక్కఅరగంట కాలమే వుంది. ఆరుసంవత్సరాలపాటు నువ్వు చెప్పిన మతిమాలిన పనులన్నీ చిటికలో చేశాను. త్వరగా, ఆ పనేదో చెప్పు. నిన్ను నా బాని సగా చేసుకుని, లోగడ చెప్పినట్టుగాక పచ్చి పచ్చిగా తినేస్తాను," అన్నది పిశాచం.

"నాకు కప్పల బెకబెకల సంగీతం వినాలని బుద్ధవుతున్నది. అలా కొలనులోనుంచి కాదు, చెట్ల కొమ్మల మీది నుంచి.కొలనులో వున్న కప్పలన్నిటినీ కొమ్మలమీదికి చేర్చి, వాటి స్వరతాళమాధుర్యాలను నాకు వినిపించు!" అన్నాడు శివుడు.

పిశాచం, శివుడికేసి కళ్ళెర్రచేసి, "ఇంకా నయం,కప్పల సంగీతం కాదు,కాకుల బృంద గానం వినాలనివున్నదనలేదు. ఇది పుట్టరాని బుద్ధి, చావు తెలివి!" అంటూ గాలిలో పల్టీ కొట్టి కొలనులో బుడుంగుమంటూ మునిగి, చేతికి దొరికిన కప్పల్ని చెట్లకొమ్మల మీదికి చేర్చింది. పిశాచం మళ్ళీ కొన్ని కప్పల్ని పట్టేం దుకు కొలనులోకి దూకేలోగా, చెట్ల కొమ్మల మీది కప్పలుకింది కొలనులోకి దూకేశాయి.

పిశాచం కోపంతో కీచుకీచుమని అరుస్తూ, కొలనులోని కప్పల్ని కొమ్మల మీదికి చేర్చడం, అవిమరుక్షణంకొలనులోకిదూకడం — ఇలా అరగంటకాలం గడిచిపోయింది.

శివుడు ఉత్సాహంగా, "మన ఒప్పందం ప్రకారం, నేను చెప్పిన పని నువ్వు చేయలేక పోయావు.ఆరేళ్ళ గడువు ముగిసింది. ఇప్పుడు నీదారి నీది, నాదారి నాది! ఈగడ్డు అనుభ వంతో నా సోమరితనానికి స్వస్తి పలికేస్తున్నాను. ఇంటికి పోయి హాయిగా పొలం పనులు చేసుకుంటూ, నా కన్నతల్లిని సేవించుకుం టాను!" అంటూ అక్కడి నుంచి బయలు దేరాడు.

పిశాచం, శివుడికేసి కొరకొర చూస్తూ, "ఔరా, సోమరిపోతూ! ఎంత గడుసువాడి వనిపించావు. ఇక చచ్చినా నేను, సోమరి పోతుల జోలికి పోను,"అంటూ ఎగిరి, అడ విలో మరొక ప్రాంతానికి వెళ్ళిపోయింది.






# బుద్ధయ్య తెలివి

చంచలపురంలో బుద్ధయ్య అనేవాడికి తనంత తెలివైనవాడు లేడని నమ్మకం. కానీ అంతా వాడిని పరమమూర్ఖుడనేవారు. తన తెలివిని నిరూపించుకోవాలని వాడికి మహాకోరికగా వుండి, గ్రామాధికారి దగ్గరకు వెళ్ళాడు.

గ్రామాధికారి వాడితో, "ఒరేయ్! నువ్వు పరమమూర్ఖుడివని ఈ ఊళ్ళో అంతా నమ్ముతున్నారు. నువ్వేం చెప్పినా ఎవ్వరూ వినరు. ఈ ఊళ్ళో వాళ్ళు గౌరవించే మరొక ఊరి తెలివైనవాడిని కలుకుని మెప్పించి, ఆయన చేత నువ్వు తెలివిగలవాడివని ఒప్పించు. అప్పుడు మనూరివాళ్ళు నీ తెలివి గురించి ఒప్పుకుంటారు," అని చెప్పాడు.

బుద్ధయ్య పొరుగూరికి ప్రయాణమయ్యేంతలో, వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లు, ఆ ఊరుకు సిద్ధయ్య అనే యోగి వచ్చాడు. ఆయన చెప్పే విషయాలు వినడానికి ఊరివాళ్ళందరూ ఎగబడ్డారు. సిద్ధయ్య తనను మెచ్చుకుంటే ఊరివాళ్ళూ మెచ్చుకోగలరని బుద్ధయ్యకు తోచింది.ఒకరోజున వాడు కూడా వెళ్ళి ఆయన బోధలు విన్నాడు.

సిద్ధయ్య ఆ రోజు చాలా విషయాలు చెప్పాడు. కాకుల్లో తెల్లకాకు లుండవనీ, అలాంటి వాటికోసం వెతకడం మూర్ఖత్వమనీ ఆయన అన్నాడు. సమస్త ప్రాణులూ ఒక్కటేనని, ఆయన చెప్పాడు. రావణాసురుడెంత గొప్పవాడైనా పరస్త్రీ వ్యామోహం వల్ల పతనమయ్యాడనీ అందుకే మనిషి ఏ దుర్గుణాన్నీ తనలో చేరనివ్వరాదనీ ఆయన అందరికీ సందేశమిచ్చాడు.

తర్వాత బుద్ధయ్య, సిద్ధయ్యను ఆయన విడిదిలో కలుసుకుని, "స్వామీ! తర్కశాస్త్రంలో నన్ను మించినవారు లేరు. ఈరోజు తమరు చెప్పిన మాటలు కొన్ని తర్కశాస్త్రానికి అందకుండా వున్నాయి. సందేహాలు తీర్చుకునేం



దుకువచ్చాను," అన్నాడు. "అడుగు, నాయనా!" అన్నాడు సిద్ధయ్య.

"కాకుల్లోతెల్లకాకులుండవన్నారు. అందుకు ప్రమాణమేమిటి?" అని అడిగాడు బుద్ధయ్య.

"నాకు తెలిసి ఇంతవరకూ తెల్లకాకుల్ని ఎవ్వరూ చూడలేదు," అన్నాడు సిద్ధయ్య నెమ్మదిగా.

"నాకు తెలిసిఇంతవరకూ ఎవ్వరూ దేవుణ్ణి చూడలేదు. అందువల్ల దేవుడు లేనట్లేనా?" అన్నాడు బుద్ధయ్య.

"దేవుడున్నాడనుకోవడం వల్ల ఎన్నో ప్రయోజనాలు వున్నాయి. తెల్లకాకి వున్నదనుకుంటే ప్రయోజనమేమీ లేదు," అని చెప్పాడు సిద్ధయ్య.

దీనికి బుద్ధయ్య చిన్నగా నవ్వి, "నిజం తెలుసుకునేందుకు ప్రయోజనం కావాలా స్వామీ! నేను తర్కశాస్త్ర ప్రకారం తెల్లకాకులు న్నాయని ఋజువు చేస్తాను. వింటారా?" అన్నాడు బుద్ధయ్య.

సిద్ధయ్య కుతూహలంగా తలూపాడు.

అప్పుడు బుద్ధయ్య గొంతు సవరించుకుని, "సమస్త ప్రాణులూ ఒక్కటేనని తమరు సెలవిచ్చారు. మనుషుల్లో తెలుపూ నలుపులు న్నాయి. కుక్కల్లో వున్నాయి. ఆవుల్లోవున్నాయి. అలాంటప్పుడు కాకుల్లో ఎందుకుండకూడదు?" అన్నాడు.

"ఉండవచ్చు," అన్నాడు సిద్ధయ్య.

"అంటే తెల్లకాకులుండవని మీరన్న మాట పొరబాటే కదా!" అన్నాడు బుద్ధయ్య.

"కావచ్చు," అన్నాడు సిద్ధయ్య.

"చూశారా స్వామీ! తర్కశాస్త్రం ఉపయోగించి నా మాటలు నేను ఋజువు చేసుకున్నాను. మీరు మీ మాటలు ఋజువు చేసుకోలేకపోయారు," అన్నాడు బుద్ధయ్య.

సిద్ధయ్యనవ్వి, "వాదనలెందుకునాయనా! సందేహాలేమైనా వుంటే అడుగు. చెబుతాను," అన్నాడు.

"రామాయణం కథ వింటే నాకు రావణుడే గొప్పవాడనిపించింది. రాముడు చెడ్డవాడనిపించింది," అన్నాడు బుద్ధయ్య.

"వారివారి బుద్ధుల్ని బట్టి అలా అనిపిస్తూంటుంది," అన్నాడు సిద్ధయ్య.

"ఇందులో బుద్ధి ప్రభావమేమీ లేదు, స్వామీ! తమరు వింటానంటే తర్కశాస్త్రముప యోగించి అంతా ఋజువు చేస్తాను." అన్నాడు బుద్ధయ్య.

సిద్ధయ్య వాడి తర్కం వినడానికి కుతూహలపడ్డాడు.

"వాల్మీకి శ్రీరామచంద్రుడి పరమ భక్తుడు. రామాయణం ఆయన రాశాడు. కాబట్టి, రాముణ్ణి కథానాయకుడిగానూ, ఆయన శత్రువు అయిన రావణుణ్ణి దుష్టుడుగానూ వర్ణించాడు. దీనిని మీరు కాదంటారా?" అన్నాడు బుద్ధయ్య.

"కాదనను. కానీ రాముడికే ఎందుకు భక్తులున్నారు? రావణుడికెందుకు భక్తులు లేరు?" అని అడిగాడు సిద్ధయ్య.

"రావణుడికీ భక్తులుండేవారు. కానీ యుద్ధంలో ఎవరు నెగ్గితే వాళ్ళ గొప్పే నిలబడుతుంది. శ్రీరాముడు ఎన్నో అన్యాయాలు చేసి రావణుణ్ణి చంపేశాడు. తన గురించి వాల్మీకి చేత రామాయణం రాయించుకుని గొప్పగాప్రచారంచేయించుకున్నాడు," అన్నాడు బుద్ధయ్య.

సిద్ధయ్య నవ్వి, "నువ్వు చాలా తెలివైన వాడివి," అన్నాడు.

వెంటనే బుద్ధయ్య, "తమరొప్పుకున్నారు. కానీ మా ఊరివాళ్ళెవరూ నా తెలివిని ఒప్పుకోవడం లేదు. అందరికీ మీరు నా విషయం చెప్పాలి," అన్నాడు.



"సరే,రేపు నేను మాట్లాడే ముందు నిన్ను పిలుస్తాను. తెల్లకాకి గురించీ, రామాయణం గురించీ నీకు తెలిసినవి చెప్పు. నువ్వు చెప్పినవి కాదని నిన్నెవరైనా ఎదిరించగలరేమో చూద్దాం," అన్నాడు సిద్ధయ్య.

బుద్ధయ్య సంతోషంగా ఇంటికి వెళ్ళాడు.

మర్నాడు సిద్ధయ్య అన్నమాట ప్రకారం బుద్ధయ్యను సభాసదుల మధ్యకు పిలిచాడు. వాడుతను చెప్పదలిచిందేదో చెప్పాక ఆయన, "మీలో ఎవరైనా బుద్ధయ్య మాటలను తర్కంతో ఖండించడానికి సిద్ధంగా వున్నారా?" అని అడిగాడు. ఒక్కరూ ముందుకు రాలేదు. గ్రామాధికారి మాత్రంలేచి నిలబడి, "అందుకు తమరే సమర్థులని మా నమ్మకం," అన్నాడు.

ఇది విని బుద్ధయ్య చాలా గర్వపడ్డాడు. ఊళ్ళో ఒక్కరుకూడా తన మాటలు ఖండించలేకపోయారు. సిద్ధయ్య ఎలాగూ ముందే ఓడిపోయాడు కాబట్టి, నలుగురి ముందూ తనను తెలివైనవాడుగా ప్రకటిస్తాడని వాడు నమ్మాడు.

సిద్ధయ్యగొంతుసవరించుకుని, "ఒకప్పుడు మశూచి వస్తే అమ్మవారికి బలులిచ్చే వారు. కొందరు తెలివైనవాళ్ళు అది తప్పని వాదించి, మశూచికి సరైన మందు కనిపెట్టారు. ఒకప్పుడు భూమి బల్లపరుపుగా వుండేదనుకునే వారు. కొందరు తెలివైనవాళ్ళు అది కాదన్నారు. అందువల్ల ఖగోళశాస్త్రానికి సంబంధించి ఎన్నో లెక్కలు తెలిశాయి. తెలివైన వాళ్ళేం చెప్పినా అది విడ్డూరంగా వుంటుంది. కానీ అందువల్ల మనిషికి ఎన్నో ప్రయోజనాలుంటాయి," అన్నాడు.

ఈ మాటలకు బుద్ధయ్య మరింత గర్వపడ్డాడు. అందరికేసి గర్వంగా చూడసాగాడు. గ్రామస్థులందరూ కుతూహలంగా సిద్ధయ్య చెప్పేది వింటున్నారు.

సిద్ధయ్య ఇంకా ఇలా అన్నాడు : "తెలివైనవారి ఆలోచన నలుగురూ నడిచే దారిలో వుండదు. జనం వాళ్ళను మూర్ఖులనే అనుకుంటారు. ఈ బుద్ధయ్య కూడా అలాంటి వాడేనని నా నమ్మకం. వీడి ఆలోచనల వల్ల ప్రపంచానికేమైనా ప్రయోజనముందని, ఏదో ఒకరోజున ఋజువు కావచ్చు. అంత వరకూ వీడు మూర్ఖుడనే భావించక తప్పదు."

గ్రామస్థులందరూ ఈ మాటలకు పకపకా నవ్వారు.

అప్పుడుబుద్ధయ్యకోపంగా, "నన్ను మూర్ఖుడనడం కాదు. తెలివివుంటే వాదనతో ఖండించండి," అన్నాడు.

సిద్ధయ్య చిన్నగా నవ్వి, "తెలివైన వాడి ముఖ్యలక్షణం మూర్ఖులతో వాదనకు దిగకపోవడం. ఈ ఊరి వాళ్ళూ, నేనూ ప్రస్తుతానికి చూపించగల తెలివి అదే!" అన్నాడు.

గ్రామస్థులు ఘొల్లుమన్నారు. బుద్ధయ్యకు చచ్చేటంత అవమానమయింది. ఆ తర్వాత, వాడెన్నడూ తన తెలివి ప్రదర్శించే ప్రయత్నం చేయలేదు.






బ్రాహ్మణుడు పాండవులున్న చోటికి వచ్చి, "మా రాజుగారు మీ వృత్తాంతమంతా తెలుసుకుని రమ్మని నన్ను పంపాడు. మా రాజుగారు పాండుమహారాజుకు స్నేహితుడు; తన కుమార్తెను అర్జునుడికిచ్చి పెళ్ళి చెయ్యాలని కలలుగన్నాడు. అందుచేత మీ కులగోత్ర నామాలు తెలిపి, సంతోషం కలిగించండి," అని అడిగాడు.

ధర్మరాజు ఆ బ్రాహ్మణుడికి అతిథి సత్కారాలు జరిపి కూర్చోబెట్టి, "మీ రాజు గారికి మా కులగోత్రనామాలతో ఏం పని? మత్స్య యంత్రం కొట్టినవారికి తన కుమార్తె నిస్తానన్నాడు. మా వాడు ఆ పని చేసి పిల్లను గెలుచుకున్నాడు. మీ రాజు కోరిక నెరవేరిందని అనుకుంటున్నాను," అన్నాడు.

ఇంతలో ద్రుపదుడు పాండవులను తీసుకురమ్మని పంపిన రథాలు వచ్చాయి. పాండవులందరూ వేరువేరు రథాలలో ఎక్కారు. కుంతీ, ద్రౌపదీ ఒకరథంలో ఎక్కారు. రథాలు రాజనగరు చేరాయి. ద్రుపదుడు వారి కోసం రకరకాల కానుకలు పంపాడు. అయితే పాండవులు క్షత్రియోచితమైనవే గ్రహించి, మిగిలినవి వదిలేశారు. తరవాత ద్రుపదుడు వారిని కళ్ళారా చూసి, నిశ్చయంగా క్షత్రియులేనని రూఢి చేసుకున్నాడు.

ఒక మంటపంలో సమావేశం జరిగింది. అక్కడ ద్రుపదుడు ధర్మరాజుకేసి తిరిగి, "అయ్యా, మీ రెవరో మాకు తెలియలేదు. మీ రెవరో తెలిస్తేనేగాని మా పిల్లను శాస్త్రోక్తంగా వివాహం చెయ్యటంసాధ్యం కాదు," అన్నాడు.

15. ద్రౌపదీవివాహం



అప్పుడు ధర్మరాజు నిజంచెప్పేశాడు. ద్రౌప దిని గెలుచుకున్నవాడు అర్జునుడేనని తెలియ గానే ద్రుపదుడి కంట ఆనందబాష్పాలు రాలాయి. "మీరు లక్కయింట చనిపోకుండా తప్పించుకోవటం నా అదృష్టం. మీకు మీ రాజ్యం తిరిగి సంపాదించి పెడతానని ప్రతిజ్ఞ చేస్తున్నాను," అన్నాడాయన.

కుంతీదేవీ, పాండవులూ, ద్రౌపదీ ఉండటా నికి మంచి భవనం ఒకటి ఏర్పాటయింది. అందులో వాళ్ళకు సుఖంగా జరుగుతున్నది. కొద్ది రోజులయ్యాక ద్రుపదుడు పాండవులతో, మంచి శుభముహూర్తం చూసి ద్రౌపదికీ, అర్జునుడికీ త్వరలో వివాహం ఏర్పాటు చేస్తా నన్నాడు.

"అదిఎలా వీలవుతుంది? అర్జునుడి కన్న పెద్దవాళ్ళం నేనూ, భీముడూ ఇంకా అవివాహి తులం," అన్నాడు ధర్మరాజు.

"అలా అయితే మా కృష్ణను నీకే ఇచ్చి చేస్తాను", అన్నాడు ద్రుపదుడు.

"మీ కుమార్తె రత్నం లాంటిది. రత్నాన్ని అందరూ స్వీకరించవచ్చును. మా అమ్మ నోట వచ్చిన మాటను బట్టి మేము అయిదుగు రమూ ఆమెను పెళ్ళాడతాము," అన్నాడు ధర్మ రాజు.

ఈ మాటకు ద్రుపదుడు నివ్వెరపోయి, "ఒక పురుషుడు అనేకమంది భార్యలను పెళ్ళాడవచ్చును గాని, ఒక స్త్రీ అనేక మంది భర్తలను వివాహం చేసుకోవటం ఎక్కడన్నా కద్దా? దీని విషయమై రేపు నువ్వూ, నేనూ, కుంతీదేవీ, మా ధృష్టద్యుమ్నుడూ కలిసి చర్చించి, ఏదో ఒకటి నిశ్చయించుకుందాం," అని చెప్పి అప్పటికి చర్చ కట్టిపెట్టాడు.

ఆ సమయానికి నల్లజింకతోలు ధరించి కృష్ణద్వైపాయనుడు అక్కడికి వచ్చాడు. అందరూ ఆయనకు ఎదురు వెళ్ళి, పూజించి, తీసుకు వచ్చి ఉచితాసనం మీద కూర్చోబెట్టి, తాము కూడా కూర్చున్నారు.

ఆ సభలో ద్రుపదుడు కృష్ణద్వైపాయ నుడితో, "మహాత్మా, అన్ని ధర్మాలూ తెలిసిన వాడై ఉండి కూడా ఈ ధర్మరాజు, నా కుమా ర్తెను తాము అన్నదమ్ములు అయిదుగురూ పెళ్ళాడాలంటున్నాడు. మీకు తెలియని విష

యాలుండవు. ఏ యుగంలోనైనా అనేకమంది పురుషులు ఒక్కస్త్రీని పెళ్ళాడినదికద్దా? అది ధర్మవిరుద్ధం కాదా?" అన్నాడు.

వెంటనే ధర్మరాజు, "అధర్మం నా నోట ఎన్నడూ రాదు. మేమందరమూ ఈమెను పెళ్ళాడతామన్నప్పుడు మీరు నిశ్చింతగా ఆ పని చెయ్యవచ్చును. మా తల్లి ఆజ్ఞ అయింది. తల్లి ఆజ్ఞ పాలించటం కన్న ఉత్తమ ధర్మమే మున్నది?పూర్వాచారాలమాటకు వస్తే, గౌతమి వంశంలో పుట్టిన జటిల అనే మునికన్య ఏడుగురికి భార్య అయింది. దాక్షాయణి అనే మునికన్య ప్రచేతసులనే మునులు పదిమందికి భార్యఅయింది.ఇవిపురాణాలలో మనం విన్నవే," అన్నాడు.

ధృష్టద్యుమ్నుడు మరొక రకం అభ్యంతరం లేవదీశాడు: తమ్ముడైన అర్జునుడు స్వశక్తితో గెలుచుకున్న కన్యను అన్న అయిన ధర్మరాజు ఎలా పెళ్ళాడతాడు?కృష్ణ ఇంతమందికి ఎలా భార్య అవుతుంది?

కుంతి తన మాటఅబద్ధంకారాదని పట్టు పట్టింది. కృష్ణద్వైపాయనుడు కుంతికి ధైర్యం చెప్పి, ద్రుపదుడితో,"రాజా, ధర్మరాజు చెప్పి నది అధర్మం కాదు. కుంతి కోరికా తప్పు కాదు.ఈఅయిదుగురు అన్నదమ్ములకూ నీ కుమార్తె నిచ్చి వివాహం చెయ్యి," అన్నాడు.

తరవాత ఆయన ద్రుపదుణ్ణి ఏకాంతంగా తీసుకుపోయి,ద్రౌపదిపూర్వజన్మలవృత్తాంతం ఈ విధంగా చెప్పాడు:



పూర్వం మౌద్గల్యుడనే మునికి ఇంద్రసేన అనే భార్య ఉండేది. మౌద్గల్యుడికి కుష్ఠువ్యాధి సోకటం చేత ఆమెకు భర్త నుంచి ఎలాటి సుఖమూ లేకుండా పోయింది. ఆమె భర్తకోసం కలవరిస్తూ చనిపోయి, మరొక జన్మలో కాశీ రాజు కుమార్తెగా పుట్టింది. ఆ జన్మలో ఆమె ఎంతో సౌందర్యవతి. అయినా ఆమెకు భర్త దొరకలేదు. అందుకామె చాలా దుఃఖించి, పరమేశ్వరుణ్ణి గురించి తీవ్రమైన తపస్సు చేయనారంభించింది.కొంతకాలానికి పరమేశ్వ రడు ఆమె ఎదుట ప్రత్యక్షమై,నీకేమి కావాలో కోరుకో," అన్నాడు.

ఆమె ఆత్రంగా, "పతి,పతి,పతి,పతి,పతి!" అని అయిదుమార్లు అన్నది.



"నీకు వచ్చేజన్మలోఅయిదుగురు మహా పురుషులు భర్తలు కాగలరు,"అన్నాడు మహేశ్వరుడు.

తనకు అయిదుగురు భర్తలయేటట్టుంటే, తాను అందరికీ సమంగా సేవలు చేస్తూ, అందరినీ సమంగా సుఖపెట్టేటట్టు అనుగ్రహించమని కాశీరాజు కూతురు మహేశ్వరుణ్ణి వేడింది.

ఆమె ఇప్పుడు ద్రౌపదిగాపుట్టి,పూర్వజన్మలో పరమేశ్వరుడిచ్చిన వరాన్ని అనుసరించి పాండవులయిదుగురికీ భార్య కానున్నది.

ఈ సంగతి చెప్పి, కృష్ణద్వైపాయనముని ద్రుపదుడికి, పూర్వకాలం ఇలాటి వివాహాలుండేవనటానికి ఒక నిదర్శనం చెప్పాడు. అదేమిటంటే; నితంతుడనే రాజర్షికి సాల్వేయుడూ,శూరసేనుడూ,శ్రుతసేనుడూ,సారుడూ, అతిసారుడూ అనే అయిదుగురు కొడుకులుండేవారు.

ఎంతో అన్యోన్యంగా ఉండే ఆ అయిదుగురూ కలిసి ఉశీనర రాజకుమార్తె అయిన అజితను పెళ్ళాడి, ఆమె యందు ఆ అయిదుగురూ సంతానం కన్నారు. ఇది ఒకప్పుడు ఉండిన ఆచారమే.

వ్యాసుడైన కృష్ణద్వైపాయనుడే ఈ మాట చెప్పాక ద్రుపదుడికి సందేహనివృత్తి అయింది. పాండవులందరూ తన కుమార్తెను పెళ్ళాడటానికి సమ్మతించాడు.

ఆరోజే మంచి లగ్నం ఉన్నది. చంద్రుడు పుష్యమి నక్షత్రంతో కలిసి ఉన్నాడు. అందుచేత పాండవులకు ద్రౌపదితో ఆ రోజే వివాహం కావటం మంచిదని కృష్ణద్వైపాయనుడన్నాడు. ద్రుపదుడు వెంటనే వివాహయత్నాలు ప్రారంభించాడు. కాంపిల్య నగరమంతటా అరటిచెట్లూ, పోకగుత్తులూ అమర్చారు. లేత రావిఆకుల తోరణాలు అమర్చారు. అన్ని ఇళ్ళముందూ గంధం కలిపిన నీటితో అలికి, కర్పూరంతోనూ, ముత్యాలతోనూ ముగ్గులు పెట్టారు. నగరమంతా అలంకరించబడి, జనంతో కిటకిట లాడింది. అంతటాపుష్పమాలలుకనిపించాయి,సువాసనలు కొట్టాయి, మంగళాశీర్వచనాలు వినిపించాయి. ద్రుపదుడి భవనానికి ఈశాన్యాన

పెళ్ళిపందిరి వేశారు. దానిని చక్కగా అలంకరించారు. దాని స్తంభాలకు ఆకుపచ్చ పట్టు బట్టలు చుట్టారు. రంగురంగుల బట్టలతో చాందినీ అమర్చి, దానికి ముత్యాల మాలలూ, పుష్పమాలలూ వేళ్ళాడగట్టారు. బంగారు తిన్నె మీద అగ్నికుండం ఏర్పాటు చేశారు. బంగారు పాత్రలతో పుణ్యనదీ జలాలు తెచ్చిపెట్టారు.

అక్కడికి పాండవులయిదుగురూ మంగళ స్నానాలు చేసి, మేలి వస్త్రాలు ధరించివచ్చారు. చక్కని బట్టలూ, అలంకరణలూ ధరించి చెలులతోసహా ద్రౌపదికూడావచ్చింది. ధౌమ్యుడు పుణ్యాహవాచన మయ్యాక ముందుగా ద్రౌపదినీ, ధర్మరాజునూ పెళ్ళి పీటల మీద కూర్చోబెట్టి, హోమం చేయించి, శాస్త్రోక్తంగా వారిద్దరికీ పాణిగ్రహణం చేయించాడు. తరవాత భీమార్జున నకుల సహదేవులు అదేవిధంగా ద్రౌపదిని పెళ్ళాడారు.

ద్రుపదుడు తన అల్లుళ్ళందరికీ వేరువేరుగా వెలలేని ఆభరణాలూ, ధనమూ, ధనేతరాలూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, దాసీలూ, పాడిఆవులూ కానుక ఇచ్చాడు. పాండవులు తన అల్లుళ్ళు అయి ఉండగా దేవతలు కూడా తనను ఏమీ చెయ్యలేరని ద్రుపదుడికి తోచింది.

వివాహ విధి పూర్తికాగానే ద్రౌపది అంతఃపురంలోకి తిరిగి వచ్చి, ఉత్తమాసనంలో అంతఃపుర స్త్రీల మధ్య కూర్చుని ఉన్న కుంతీదేవి వద్దకు పోయి, సాష్టాంగ వందనం చేసి,



చేతులు జోడించి నిలబడింది. కుంతీదేవి తన కోడలిని చూసుకుని ఎంతో ముచ్చటపడి, ఆమెకు నీతులు చెప్పి, ఆశీర్వదించింది.

పాండవులు ద్రౌపదిని పెళ్ళాడినట్లు తెలియగానే కృష్ణుడు ఆ అయిదుగురికీ అంతులేని కానుకలు తీసుకువచ్చాడు. తరవాత పాండవులు కృష్ణుడితో సహా కాంపిల్యనగరంలోనే ఉండి సమస్త భోగాలూ అనుభవించసాగారు.

ద్రౌపదీ స్వయంవరంనాడు మత్స్యయంత్రాన్ని కొట్టి, కర్ణుడితో యుద్ధం చేసిన వాడు అర్జునుడేననీ, శల్యుణ్ణి ఓడించిన వాడు భీముడనీ, పాండవులు లక్కయింట కాలిపోక సజీవులుగానే ఉన్నారనీ, ఎలాగో వారు కుంతీదేవితో సహా ఆ ఆపద నుంచి బయట

పడ్డారనీ రాజలోకానికి ఇప్పుడు తెలిసిపో యింది.

హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయే దుర్యోధనుడికికూడాఈమాట తెలిసింది.పాండవుల అదృష్టం చూసి దుర్యోధనుడు కృంగిపో యాడు. అప్పుడు దుశ్శాసనుడు తన అన్నను సమీపించి, "బ్రాహ్మణవేషం వెయ్యకపోతే ఆ అర్జునుడికి ద్రౌపది దక్కి ఉండునా? వాడు అర్జునుడని తెలిస్తే అంత తేలికగా వదిలిపెట్టేవాళ్ళమా? ఇప్పుడనుకుని ఏం లాభం? బాహుబలం కన్న దైవబలం హెచ్చు కావటం జరిగింది!" అన్నాడు. ఈ విధంగా వాళ్ళు జరిగిన దానికి విచారిస్తూ, లక్కయిల్లు కాల్చటానికి తాము రహస్యంగా నియోగించిన పురోచనుణ్ణితిట్టుకుంటూహస్తినాపురంచేరుకు న్నారు.

జరిగినదంతా తెలియగానే సంతోషించిన వాడు విదురుడు. ఆయన ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి ద్రౌపదీ స్వయంవర వార్తలన్నీ తెలిపాడు. ఏ కారణం చేతనో ధృతరాష్ట్రుడు ద్రౌపది తన కొడుకైన దుర్యోధనుణ్ణి వరించిందనుకుని, పరమానందం చెంది, "ఆ ద్రౌపదికి రత్నాభరణాలనూ, చీనాంబరాలనూ పంపించు. వెంటనే ఆమెను హస్తినాపురానికి రప్పించు," అన్నాడు విదురుడితో.

ధృతరాష్ట్రుడు తన మాటలను అపార్థం చేసుకున్నట్టు విదురుడు గ్రహించి, "ద్రుపదుడి కూతురు వరించినది అర్జునుణ్ణి. పాండవులు అయిదుగురున్నూ ఆ ద్రౌపదిని పెళ్ళాడే శారట," అని వివరంగా చెప్పాడు.

అంతా విని ధృతరాష్ట్రుడు, "అయితే ఏమంటావు? నాకు, నిజం చెప్పాలంటే, దుర్యోధనుడూ వాళ్ళకన్న పాండవులంటేనే హెచ్చు ప్రేమ. వాళ్ళు ఎంత పరాక్రమవంతులు! పెద్దవాళ్ళకు ఎలా సేవలు చేస్తారు! యుక్తాయుక్తాలు వాళ్ళకెంత బాగా తెలుసు! ద్రుపదుడితో సంబంధం చేసుకుని వాళ్ళిప్పుడు మరింత బలవంతులయ్యారు. వాళ్ళు బతికి బాగున్నారంటేనే నాకెంతో సంతోషమయింది!" అన్నాడు.

"రాజా, ఎల్లకాలమూ నీ బుద్ధి ఇలాగే ఉండుగాక!" అన్నాడు విదురుడు.



# గంపకిందికోళ్ళు

చిట్టెయ్య అనేవాడు, చింతబరిక తీసుకుని పదేళ్ళ కొడుకు వీపు మీద కొడుతూ కేకలు పెడుతున్నాడు. ఆ దారే వెళుతున్న ధర్మయ్య అనే పెద్దమనిషి అది చూసి, చిట్టెయ్యను సమీపించి చింతబరికెలాక్కుని, "చిన్న పిల్లవాణ్ణి ఎందుకలా కొడతావు?" అని నిలదీశాడు.

"అయ్యా! మీకేం తెలియదు, తప్పుకోండి. గంపకిందికోళ్ళను బయటికి వదలొద్దురా అని ఎన్నిసార్లు చెప్పినా, వీడు వినడు," అన్నాడు చిట్టెయ్య కోపంతో ఊగిపోతూ.

"పిల్లవాడు గంపకిందికోళ్ళను వదిలేస్తే ఇప్పుడేం అయింది? ఏ గద్దో తన్నుకుపోవడమో, కుక్క ఏదైనా నోటకరుచుకు పోవడమో జరిగిందా?" అని అడిగాడు ధర్మయ్య.

"అలాంటిదేం జరగలేదు, బాబూ! చింతబరికె యిటివ్వండి,"అంటూ కొడుకు కేసి గుడ్లురిమి చూశాడు చిట్టెయ్య.

ధర్మయ్యకు, చిట్టెయ్య మాటలు మరీ అసందర్భంగా తోచి, "చిట్టెయ్యా, కాస్త శాంతపడు. మేతమేసి నాక కోళ్ళు నీ ఇంటిని వెతుక్కుంటూ అవే తిరిగి వస్తాయి కదా! మరెందుకీ పిచ్చికోపం?" అన్నాడు.

"అన్నీ ఎలా తిరిగివస్తాయి? వాటిల్లో రెండే నావి. మిగతావి దేని యజమాని ఇంటికి అవి పోతాయి." అన్నాడు చిట్టెయ్య.

ఆ జవాబుతో సంగతి తెలుసుకున్న ధర్మయ్య, "అదా అసలు రహస్యం! ఈ మధ్య ఊళ్ళో వాళ్ళ కోళ్ళతో పాటు,నావీ కొన్ని కనబడకుండా పోతున్నవి. పద, గ్రామాధికారి దగ్గరకు! ఈ చింతబరికె నీ వీపు మీద ఎన్నిదెబ్బలకు విరిగిపోతుందో, ఆయనే చూస్తాడు,"అంటూ చిట్టెయ్యను గ్రామాధికారి వద్దకు లాక్కుపోయాడు.

- వి. ఉమాదేవి



| చందమామ అనుబంధం - 82 | మనదేశపు చెట్లు : |
| --- | --- |

# లిచ్చీ

ఒకానొకప్పుడు ఒక చీనా కవిని కాంటన్‌కు బహిష్కరించారు. అక్కడ ఆయనకు రోజూ ఆహారంలో లిచ్చీ పళ్ళు ఇచ్చారు. ఇలా రోజూ లిచ్చీ పళ్ళు లభించేలాగా ఉంటే యావజ్జీవ బహిష్కరణ అయినా సంతోషంగా అనుభవిస్తాను — అన్నాడట ఆ కవి. లిచ్చీ చెట్టు చైనా నుంచి, తొలి బౌద్ధయుగంలో మన దేశానికి వచ్చిందని చెబుతారు. బీహార్‌లోని ముజాఫర్ పూర్ జిల్లాలోనూ, పశ్చిమబెంగాల్‌లోని హుగ్లీజిల్లాలోనూ, ఉత్తరప్రదేశ్ డెహ్రాడూన్‌లోనూ, పంజాబ్‌లోని గురుదాస్‌పూర్‌లోనూ, తమిళనాడులోని నీలగిరి జిల్లాలోనూ, లిచ్చీ తోటలు పెంచుతారు. ఈ లిచ్చీ సాగుబడిలో మనదేశం ప్రపంచంలో మూడవ స్థానంలో ఉన్నది.

ఎప్పుడూ పచ్చగా కనిపించే ఈ చెట్లు 12 మీటర్ల ఎత్తు పెరుగుతాయి. కొమ్మలు విరచాచుకుని ఉంటాయి. ఆకులు పై భాగంలో నున్నగా ఉంటాయి. కొమ్మల చివర చిన్న చిన్న పువ్వులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. కాయలు అండాకారంలో గుత్తులు గుత్తులుగా కాస్తాయి. పళ్ళు ఎర్రగా ఉంటాయి. కొన్ని లేత పచ్చరంగులోనూ ఉంటాయి. గరుకుగా ఉన్న పైతొక్కను తొలగించినట్టయితే లోపల విత్తనం చుట్టూ మెత్తని గుజ్జు కనిపిస్తుంది. ఇది చాలా తియ్యగాఉంటుంది. దీనిలో బి, సి, డి విటమినులు పుష్కలంగా లభిస్తాయి. ఉత్తర భారత దేశంలో మే - జూన్ నెలలలోనూ దక్షిణ ప్రాంతంలో ఏప్రిల్ - మే నెలలలోనూ కాపుకు వస్తాయి. వీటి గింజలే కాకుండా వేళ్ళు, బెరడు, పువ్వులు కూడా ఔషధ గుణాలు కలిగి ఉన్నాయి.



మనదేశపు ఋషులు : 6

# భృగువు

మన దేశంలో కొందరి వంశనామాలు, సుప్రసిద్ధ ప్రాచీన ఋషుల పేర్లకు సంబంధించినవిగా ఉంటాయి. ఆ విధంగా భార్గవులని పిలువబడేవారు భృగువంశానికి చెందినవారని చెబుతారు.

భృగువు పురాణ కాలానికి చెందిన గొప్ప ముని. ఆయన పూజార్హుడైన దేవుణ్ణి కనుగొని సాటి మునులకు తెలియజేసిన ముని పుంగవుడు.

ఆయన ఒకప్పుడు విష్ణువును దర్శించడానికి వైకుంఠానికి వెళ్ళాడు. అప్పుడు మహావిష్ణువు యోగనిద్రలో వున్నాడు. భృగువు కొంతసేపు అక్కడే కూర్చున్నాడు. కాని విష్ణువు నిద్ర లేవలేదు. గొప్ప తపస్సంపన్నుడయిన ముని అయిన తాను వచ్చినా లెక్క చేయలేదన్న అహంభావంతో, భృగువు వివేకాన్ని కోల్పోయాడు. స్థితికారుడైన విష్ణువు ఇంతసేపు నిద్రపోతే ఎలా? అన్న ఆగ్రహంతో ఆయన విష్ణువును వక్షస్థలంపై తన్నాడు. ఇంద్రియ నిగ్రహం గల ముని అయివుండీ, ఆగ్రహం కారణంగా ఆయన ఒక్క క్షణం విచక్షణారహితంగా ప్రవర్తించాడు!

నిద్ర లేచిన విష్ణువు ఆగ్రహం చెందలేదు. అతిథి సత్కారం చేయకుండా ఉపేక్షించినందుకు మునికి క్షమాపణలు చెప్పుకున్నాడు. తన వక్షస్థలాన్ని తాకడం వల్ల గాయపడిందేమో అని భృగువు పాదాన్ని ఒత్తసాగాడు! మహావిష్ణువు శాంత గుణానికీ, వినయానికీ భృగువు ఆశ్చర్యంతో అవాక్కయి పోయాడు. తన ప్రవర్తనకు పశ్చాత్తాపం చెందాడు. శాంత సత్వ స్వరూపుడైన మహావిష్ణువే పూజార్హుడు అనీ, ఆయనే జనన మరణాల నుంచి విముక్తి కలిగించే మోక్షప్రదాత అనీ మునులకు తెలియజేశాడు.

అగ్నికి ఆహుతిచ్చినట్టయితే మలిన పదార్థాలు సైతం నిర్మలం కావాలని భృగువే శాసించాడు.

మనుషుల భూత భవిష్యత్ వర్తమానాలను తెలియజేసే 'భృగు సంహిత' అనే ఒక జ్యోతిష గ్రంథం కూడా ఉన్నది. అది భృగు మహర్షి జ్యోతిషపాండిత్యాన్ని చాటుతున్నది.

చ్యవనుడు, శుక్రుడు, జమదగ్ని, పరశురాముడు, వాల్మీకి, మొదలైన సుప్రసిద్ధ మునులు భార్గవ వంశానికి చెందినవారే!



# మీకు తెలుసా?

1. అశోక చక్రవర్తి తన మొట్టమొదటి శాసనాన్ని ఎప్పుడు ప్రకటించాడు?
2. 'పెగోడాల (ఆలయ) దేశం'గా దేనిని పిలుస్తారు?
3. మనదేశంలో 'ఆసియా అడవి గాడిదలు' ఏ ప్రాంతంలో ఉన్నాయి?
4. అమెరికాలో రెండు ప్రధాన రాజకీయ పక్షాలు ఉన్నాయి. అవి ఏవి?
5. భారతదేశం ఒక పరుగు కూడా తీయకుండా నాలుగు వికెట్లు కోల్పోయిన టెస్ట్ మేచ్ ఎప్పుడు జరిగింది?
6. రెక్కలు లేని పక్షి ఏది?
7. ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీకి మొట్టమొదటి అధ్యక్షురాలుగా ఎన్నికయిన భారతీయ మహిళ ఎవరు?
8. ఫుట్ బాల్‌లో మొట్టమొదట 1000 గోల్స్ సాధించిన వారెవరు?
9. చోళుల రాజధాని ఏది?
10. ఆంగ్లేయులకూ, ఫ్రెంచి వాళ్ళకూ మధ్య మన దేశంలో ఏడేళ్ళ పాటు యుద్ధం సాగింది. ఆ యుద్ధం పేరేమిటి?
11. మహమ్మద్ గజినీ మనదేశం మీదికి ఎప్పుడు దండెత్తి వచ్చాడు?
12. మనదేశంలో పార్లమెంటు సభ్యులు అధికంగా గల రాష్ట్రం ఏది?
13. తాజ్‌మహల్ సమీపంలో ప్రవహించే నది ఏది?
14. ఆగ్రా సమీపంలోని ఫతేపూర్ సిక్రీ నగరాన్ని నిర్మించిన వారెవరు?
15. రెండవ చంద్రగుప్తుడి సుప్రసిద్ధ నామం ఏది?
16. అతి పెద్ద మాంసాహార జంతువు ఏది?
17. మొట్టమొదట పోలో క్లబ్బును ఎక్కడ స్థాపించారు?
18. మొట్టమొదట మనదేశానికి ఫిరంగులు తెచ్చిన దురాక్రమణదారు ఎవరు?

## సమాధానాలు

1. క్రీ.పూ. 216 వ సం॥లో.
2. బర్మా (మియాన్మార్).
3. గుజరాత్‌లోని కఛ్ ప్రాంతంలో.
4. డెమొక్రటిక్ పార్టీ; రిపబ్లికన పార్టీ.
5. 1952వ సం॥లో. ఇంగ్లాండుతో.
6. న్యూజీల్యాండ్‌లోని కివీ పక్షులు.
7. విజయలక్ష్మి పండిట్.
8. ఆస్ట్రియాలో పుట్టి జర్మనీ పక్షంలో ఆడిన ఫ్రాంజ్ బైండర్.
9. తంజావూరు.
10. కర్ణాటక యుద్ధం.
11. క్రీశ 1000 - 1026 మధ్య. దాదాపు 17 సార్లు
12. ఉత్తరప్రదేశ్.
13. యమునా నది.
14. అక్బర్ చక్రవర్తి.
15. విక్రమాదిత్యుడు.
16. పోలార్ ఎలుగుబంటి.
17. అస్సాంలో. 1859వ సం॥ కబార్ క్లబ్.
18. బాబర్.

# జరిగినపొరబాటు

హేలాపురిలో వుండే కన్నయ్య, చిన్నయ్య పరమ బద్ధకస్థులు. కష్టపడి పనిచెయ్యడం అంటే ఇద్దరికీ సుతరామూ ఇష్టముండదు. ఉన్న ఊళ్ళో వీళ్ళ సంగతి అందరికీ తెలుసుగనక, పొరుగూళ్ళకు పోయి, అక్కడ ఎవరి ఇంట్లోనైనా శుభకార్యానికి విందు భోజనాలు జరుగుతూంటే, వెళ్ళి సుష్టుగా భోజనం చేసే వాళ్ళు.

వాళ్ళిద్దరూ ఒకసారి మిట్టమధ్యాహ్నం వేళ ఒక ఊరు చేరారు. అక్కడ ఒక ఇంటి మదురుగోడ మీదుగా ఎవరో విస్తరాకులు వీధిలోకి వేస్తున్నారు.

"ఆహా, పెళ్ళి భోజనం!" అనుకుంటూ కన్నయ్య, చిన్నయ్య ఆ ఇంటి ఆవరణలోకి వెళ్ళారు. ఆ సమయంలో వడ్డన చేసేందుకు విస్తరాకులు వేస్తున్నారు. ఇద్దరూ వాటిముందు కూర్చున్నారు.

అక్కడ వడ్డన ఏర్పాట్లు అజమాయిషీ చేస్తున్నవాడు, వాళ్ళకేసి అనుమానంగా చూస్తూ, "అయ్యా! తమ రెవరైందీ కాస్త చెబుతారా?" అని అడిగాడు.

వెంటనే కన్నయ్య, "నేను పెళ్ళికూతురు మేనమామ బావమరిదినండి!" అన్నాడు.

"నన్నెరగరా! నేను పెళ్ళికొడుకు పెదతండ్రిగారి చిన్నల్లుణ్ణండి!" అన్నాడు చిన్నయ్య.

మరుక్షణం వాళ్ళను ప్రశ్నించినవాడు పెద్దగా, "ఈ దొంగవెధవల్ని వీధిలోకి గెంటండి!" అన్నాడు.

వెంటనే నలుగురు పనివాళ్ళు వచ్చి, ఆఇద్దర్నీ మదురుగోడమీదుగా పులిస్తరాకుల్లోకి విసిరివేశారు.

"ఎక్కడ జరిగిందిరా పొరబాటు, చిన్నా?" అన్నాడు కన్నయ్య ఒళ్ళు దులుపుకుంటూ.

"మనల్ని ఇక్కడికి విసిరేసిన దుర్మార్గులు తిట్టిన తిట్లు, నువ్వు వినలేదా? ఇప్పుడు జరుగుతున్నది, ఇల్లుగలాయన తండ్రి పెద్దదినం భోజనాలట!" అన్నాడు చిన్నయ్య మూలుగుతూ.

— కోనే నాగవెంకట అంజనేయులు





# మాతృమంత్రం

సీతాపతి, రుక్మిణి ఆదర్శదంపతులు. వారికి నలుగురు కొడుకులు. ఒక్కొక్కరికి ఏడాది తేడా వుంటుంది. పెద్ద కొడుక్కు ఇరవై ఏళ్ళ వయసు వచ్చే సరికి, సీతాపతి ఏదో వింత జబ్బు చేసి మంచం పట్టాడు. అప్పటికాయనవయసునలభై.భార్యవయసు ముప్పై అయిదు.

సీతాపతిని ఎందరో వైద్యులకు చూపించారు. ఎవరికీ ఆ జబ్బేమిటో అంతుపట్టలేదు. చివరకు హిమాలయాలనుంచి వచ్చిన యోగి ఒకడు, సీతాపతిని చూసి, "ఇది జబ్బు కాదు. పూర్వజన్మలో చేసిన పాపఫలం. నాతోపాటు హిమాలయాలకు రా! అక్కడ వనమూలికలు సేవిస్తూ, తపస్సు చేశావంటే నీజబ్బు క్రమంగా నయమైపోతుంది," అని చెప్పాడు.

"హిమాలయాల్లో నేనెంతకాలముండాలి?" అని అడిగాడు సీతాపతి.

"నువ్వు ఒక మంచి కుటుంబాన్ని విడదీశావు. నీకారణంగా ఆకుటుంబమంతా చెల్లాచెదరైపోయింది. ఆ పాపం ఇప్పుడు నీ శరీరాన్ని ఆవహించింది. నువ్వు ఇరవై సంవత్సరాలు హిమాలయాల్లో వుండాలి," అన్నాడు యోగి.

అప్పుడు రుక్మిణి కల్పించుకుని, "స్వామీ! ఈజన్మలో తెలిసి ఆయన ఏపాపమూ చేయలేదు. కుటుంబాన్నెంతో ప్రేమగా చూసుకున్నారు. చేతనైనంతలో పదిమందికీ సాయం చేశారు. ఇరవై సంవత్సరాలపాటు అందరికీ దూరంగా వుండమనడం న్యాయమా?" అన్నది.

"పూర్వజన్మల పాపం మనిషిని విడిచిపెట్టదు. అందుకే మనిషి అన్ని జన్మలలోనూ పుణ్యం చేయాలి. ఈజన్మలో చేసిన పుణ్యం, వచ్చే జన్మకే పనికివస్తుంది. మీ కుటుంబం ఇంతవరకూ చక్కగా నడిచిందంటే, అది నీ

జొన్నలగడ్డ రామలక్ష్మి



"నీభార్య అదృష్టజాతకురాలు. ఆమెను బిడ్డలు బాగా చూసుకునే ఉపాయమొకటుంది," అన్నాడు.

ఆఉపాయమేదో తెలుసుకునేందుకు సీతాపతి కుతూహల పడ్డాడు. అప్పుడు యోగి రుక్మిణినీ, ఆయన పిల్లలనూ కూడా పిలిచి, "మీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి. శ్రద్ధగా వినండి. సీతాపతికీ, మీకూ ఇరవై ఏళ్ళపాటు ఋణం తీరిపోయింది. ఆయన నాతో హిమాలయాలకు వస్తున్నాడు. ప్రస్తుతం ఆయన, తన భార్య రుక్మిణి గురించి చాలా బెంగపెట్టుకున్నాడు. ఎందుకంటే -- హిమాలయాలకు ఆమె రాక నిషిద్ధం. అదీకాక పిల్లలకామె అవసరమూ ఇక్కడుంది," అని చెప్పాడు.

భర్త గొప్పతనం కాదు. గత జన్మలో నీవు చేసిన పుణ్యప్రభావం," అని యోగి రుక్మిణికి వివరించాడు.

సీతాపతికి జబ్బువల్ల చాలా బాధగా వుంది. ఇలా బ్రతికే కంటే హిమాలయాలకు పోవడమే మంచిదని ఆయన నిర్ణయించుకున్నాడు. కానీ ఆయనకు భార్య రుక్మిణి గురించే బెంగగా వుంది. తను లేకుండా కొడుకులవద్ద ఆమె సుఖంగా వుండగలదా? కొడుకులకు పెళ్ళిళ్ళయితే తల్లిని బాగా చూసుకుంటారా? ఇంతకూ తను భార్యా బిడ్డల కోసం పెద్దగా మిగిల్చిన ఆస్తి ఏమీలేదు.

సీతాపతి సంశయాలూ, అనుమానాలూ అర్థం చేసుకున్న యోగి బాగా ఆలోచించి,

రుక్మిణి దీనికి ముందు ఒప్పుకోలేదు. కానీ యోగి, సీతాపతి జబ్బు ఎంత ప్రమాదకరమైనదో వివరించాక అంగీకరించింది. తర్వాత పిల్లలు నలుగురూ కూడా తండ్రితో, "అమ్మను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాం. మీరు నిశ్చింతగా హిమాలయాలకు వెళ్ళి ఆరోగ్యం చక్కబరుచుకుని రండి!" అని చెప్పారు.

అప్పుడు యోగి వాళ్ళతో, "నేను మీకు మాతృమంత్రం ఉపదేశిస్తాను. ప్రతిరోజూ ఆమంత్రం చదువుతూ తల్లికి పూజ చేయాలి. ఒక్కరోజు కూడా తల్లి మనసు కష్టపెట్టకుండా ఆమె చెప్పినట్లు వినాలి. భక్తిశ్రద్ధలతో అలా

ఐదు సంవత్సరాలపాటు చేసినవారికి, పది లక్షలరూపాయల నిధి దొరుకుతుంది. అయితే, అలా చేయడం చాలా కష్టం. మీలో ఎవరం దుకు సిద్ధమో, వారి దగ్గర తల్లి వుంటుంది," అన్నాడు.

"అమ్మ మనసు మంచిది. అమ్మకు స్వార్థముండదు. అమ్మ బిడ్డ మేలు కోసమే ఏమైనా చేస్తుంది. కాబట్టి, అమ్మను మీరు చెప్పినట్లు పూజించుకోవడం, నాకు కష్టం కాదు. అమ్మ నాదగ్గరే వుంటుంది," అన్నాడు పెద్దకొడుకు.

మిగతా వాళ్ళు కూడా యోగికి ఇవే మాటలు చెప్పారు.

యోగి ఒక్కక్షణం ఆలోచించి, "కానీ ఈపూజ ఒకసారికి ఒకరే చేయాలి. కాబట్టి, అమ్మ మొదటి ఐదేళ్ళూ పెద్దకొడుకు దగ్గరుంటుంది. తర్వాత మరొక ఐదేళ్ళు రెండో కొడుకు దగ్గర ఉంటుంది. ఇది మీకిష్టమేనా?" అని అడిగాడు.

"అమ్మకెలా ఇష్టమైతే అలా!" అన్నారు పిల్లలందరూ ఏకకంఠంతో.

"అమ్మా! నువ్వు అదృష్టవంతురాలివి! నీ పిల్లలు రత్నమాణిక్యాలు," అని యోగి మెచ్చుకున్నాడు.

కానీ, రుక్మిణి దిగులుగా వుండడం గమనించి, పిల్లలను అక్కడి నుంచి వెళ్ళమన్నాడు. వాళ్ళు వెళ్ళాక యోగి, ఆమెను దిగులుకు కారణమడిగాడు.



"స్వామీ! పిల్లలు చిన్నవాళ్ళు. ఇప్పుడన్నింటికీ అమ్మే గొప్పదంటారు. కానీ పెద్దవాళ్ళయ్యాక ఒకరికొకరికి పడదు. ఆ విషయం నాకు బెంగగా వుంది. మాకు పెద్దగా ఆస్తి లేదు. ఇప్పుడు నేను పెద్ద కొడుకు దగ్గర చేరితే, మిగతా వాళ్ళందరూ ఏమైపోతారు?" అన్నది రుక్మిణి.

"అమ్మా! ఐదేళ్ళపాటు నీ పెద్దకొడుకు నువ్వు గీచినగీటు దాటడు. మిగతా ముగ్గుర్నీ కూడా నీతోపాటే వుంచుకో. అన్నదమ్ముల మధ్య సఖ్యాన్ని పెంచు. మిగతా వాళ్ళు ఎవరి కాళ్ళ మీద వాళ్ళు నిలబడేలా తయారు చెయ్యి. ఐదేళ్ళ తర్వాత పెద్దవాడికి పదిలక్షల నిధి దొరుకుతుంది. దానితో రెండో కొడుకు

నిన్నెంతో భక్తిశ్రద్ధలతో చూడ్డం మొదలుపెడ తాడు. అప్పుడు మిగతా ఇద్దర్నీ నీ దగ్గరే వుంచుకోవచ్చు," అన్నాడు యోగి.

"యోగివర్యా! మీరు చెప్పింది బాగానే వుంది. కానీ ఈ ప్రకారం నాపెద్ద కొడుక్కు ఇరవై ఐదేళ్ళ వయసుకు పదిలక్షలు వస్తాయి. రెండో కొడుకుకు పదిలక్షలు రావడానికి, ఇరవై తొమ్మిదేళ్ళ వయసు. అలా చూస్తే నాలుగో వాడికి ముప్పై ఏడేళ్ళ వయసు వస్తుంది. ఇది అన్యాయం కాదా?" అన్నది రుక్మిణి.

యోగి నవ్వి, "నువ్వు పిల్లల భవిష్యత్తు గురించే ఆలోచించడంవల్ల, ఇలా మాట్లాడు తున్నావు. తల్లితో కలిసి జీవించే అదృష్టమే పిల్లలకు ఎన్నో లక్షల పెట్టు. డబ్బు రాగానే పెద్దకొడుకు నిన్ను విడిచి వెళితే, అదృష్టం మిగిలినవాళ్ళది. అంతే కానీ వాళ్ళు దురదృష్ట వంతులు కారు," అన్నాడు.

"స్వామీ! నానలుగురు పిల్లలకూ ఏఅదృష్ట మైనా ఒకేసారి వచ్చేలాగు చేయలేరా?" అన్నది రుక్మిణి.

యోగి కొద్దిసేపు మౌనంగా వుండి, "అమ్మా! అదృష్టమేదో వాళ్ళ చేతుల్లో వుంది. కానీ ఇప్పుడు నేను చేసిన ఏర్పాటు వల్ల, ఇరవై సంవత్సరాలపాటు నీ పిల్లలు నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటారు. అది నీకు ముఖ్యం. అందువల్ల నీభర్త హిమాలయాల్లోసుఖశాంతు లతో వుంటాడు. ఇరవై సంవత్సరాల తర్వాత, మీరు మళ్ళీ కలుసుకుంటారు. నేనీ ఏర్పాటు చేయడానిక్కారణం నీకింకా నలభై సంవత్స రాలకుపైగా ఆయుష్షుండడమే!" అన్నాడు.

అప్పటికి రుక్మిణి తృప్తిగా తలాడించింది. ఆమె ముఖంలో దిగులు కొంత మాయమ యింది.

తర్వాత యోగి, పిల్లలు నలుగుర్నీ అక్కడికి పిలిచి, "తల్లీబిడ్డలు అందరూ అన్ని వేళలా ఒకచోట వుండడమే లక్షల లక్షల అదృష్టం!" అంటూ వాళ్ళకు మాతృమంత్రాన్ని ఉపదేశిం చాడు.

ఆ మంత్రాన్ని వింటూనే అంతవరకు రుక్మిణి మనసులోవున్న దిగులు పూర్తిగా మాయమయ్యింది.






పూర్వం మిథిలానగరంలో యశవర్ధనుడని ఒక క్షత్రియ కుమారు డుండేవాడు. వాడు అమిత పరాక్రమవంతుడు, సాహసి. దానికి తోడు వాడు అమితమైన కోపిష్టి. ఎవరి భయమూ లేక వాడు విచ్చలవిడిగా సంచరిస్తూ, దుర్మార్గుడై జీవించసాగాడు. వాడు చెయ్యని పాపకార్యం లేదు. ఎవరైనా తనను ఎదిరిస్తే వాళ్లను తన కత్తికి బలి చేస్తూండేవాడు.

కాని కొంతకాలానికి యశవర్ధనుడి పాపం పండింది. ఒకనాడు వాడు రాజు గారి బావమరిదితోనే తలబడ్డాడు. ఇద్దరూ కత్తులు దూశారు. కాని రాజుగారి బావమరిది కత్తి ఎత్తేలోపుగా యశవర్ధనుడు అతన్ని గుండెలో పొడిచేశాడు. ఈ వార్త వినగానే రాజుగారు మండిపడి, యశవర్ధనుణ్ణి పట్టుకుని తల గొట్టమని తన భటుల కందరికీ ఉత్తరు విచ్చాడు.

ప్రాణాలతో ఉండాలంటే దేశం విడిచి పారిపోవటం తప్ప మరొక మార్గం లేదు. అందుచేత యశవర్ధనుడు తన గుర్రం మీద ఎక్కి పారిపోసాగాడు. గుర్రం శరవేగంతో కోసులూ, యోజనాలూ దాటి పరిగెత్తి, గుండె పగిలి చచ్చి పడిపోయింది.

తాను ఇంకా దేశం దాటి పోలేదేమోననీ, తనకోసం రాజభటులు తరుముకుంటూ వస్తున్నారేమోననీ భయపడి యశవర్ధనుడు, అలిసిపోయి ఆకలిదప్పులతో బాధపడుతూ కూడా ఆ చీకటిలోనేఅడవుల వెంటా,కొండల వెంటా పరిగెత్తి తెల్లవారేసరికి ఒక కొండ శిఖరానికి చేరాడు. అక్కడ అతను కాస్సేపు విశ్రమించి తాను వచ్చిన దారిని పరీక్షించాడు. తనవెంట ఎవరూ రావటం లేదని రూఢిచేసుకుని కొండ అవతలి వేపు చూశాడు. అక్కడ ఒక లోయలో అమిత అందమైన నగరం ఒకటి అతనికి కనబడింది.

ఎత్తయిన మేడల మధ్యగా నడవసాగాడు. వీధిలో ఎందరో స్త్రీలూ, పురుషులూ నడుస్తు న్నారు. కొందరు నిలబడి మాట్లాడుతున్నారు. వారిలో ఒక్కరుకూడా అనారోగ్యంగా, బలహీ నంగా కనబడలేదు.

"ఇదేదో మహా పుణ్యనగరంలాగా వుంది. ఇక్కడ దుఃఖమన్నది కనిపించలేదు," అను కుంటూ యశవర్ధనుడు ఒక దుకాణం సమీ పంగా వచ్చాడు. ఆ సమయాన అతని కొక చిత్రం కంటబడింది. దుకాణదారు, కొన వచ్చినవారితో మాట్లాడుతూవున్న సమయంలో ఎవడో యువకుడు దుకాణంనుంచి ఏదో వస్తువు దొంగిలించి అటూ ఇటూ చూసి, ఏమీ ఎరగనట్టు వీధి వెంబడి నడవసాగాడు. అతను నాలుగడుగులు వేశాడో లేదో, పెద్ద మోతతో ఆ యువకుడి కాళ్ళకింది భూమి విచ్చుకున్నది; వాడు అడుగున పడిపోయాడు; వెంటనే భూమి మళ్ళీ మూసుకున్నది.

ఇది కళ్ళారా చూస్తున్న యశవర్ధనుడు చాలాసేపు స్తంభించిపోయాడు. తాను చూసిన ఈ సంఘటన ఇతరులుకూడా చూసినట్టు అతను గమనించాడు. అయితే వారు అతని లాగా ఆశ్చర్యపడలేదు. ఒక్క క్షణం ఆగి వారు మళ్ళీ తమ దారిన వెళ్ళారు. వారి కిది పరిపాటిలాగే కనబడింది.

ఈ నగరంలో జనం ఇలాగే మరణిస్తారని యశవర్ధనుడికి త్వరలోనే తెలిసి వచ్చింది. ఇంకా ఎన్నో చోట్ల ఇంకా ఎందరో భూగర్భం

ఆ నగరాన్ని చూడగానే యశవర్ధనుడికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఎందుకంటే, తమ రాజ్యంలో అటువంటి నగరం ఒకటి ఉందని అతనెన్నడూ వినలేదు. ఇది ఇంకో రాజ్యంఅయివుంటుంది. ఇక్కడతనుక్షేమంగా, సుఖంగా వుండవచ్చు. ఈ మాట అనుకుని అతను లోయలోకి దిగసాగాడు. మధ్యదారిలో ఒక గొర్రెలకాపరి కనిపించగా యశవర్ధనుడు, "ఆకనబడే నగరం పేరేమిటి?"అని అడిగాడు.

"ధర్మనగరం," అన్నాడు గొర్రెలకాపరి.

యశవర్ధనుడిఅనుమానంరూఢి అయింది. ఇదేదో కొత్త నగరం. ఆ నగరం కొత్తదే గాక చాలా వింతగా కూడా వుంది. యశవర్ధనుడు నగరం ప్రవేశించి, విశాలమైన వీధులవెంట,

లోకి పోవటం అతను కళ్ళారా చూశాడు. అంతేకాదు, వారిలో ఏఒక్కడూ ప్రమాదవశాన చావలేదు. సాటిమానవులకు ఏదో ద్రోహం తలపెట్టినవారి కాళ్ళకిందనే భూమి విచ్చుకున్నది; వాళ్ళే ఇలాటి ఘోర మరణాల పాలైనారు. ఒక చోట ఒక మనిషి నడుస్తూవుంటే ఇంకొక మనిషి వెనక నుంచి ముందున్న వాణ్ణి బాకుతో పొడవబోయాడు. అంతలోనే వాడి కాళ్లకింది భూమి పగిలి, వాడు కాస్తా భూగర్భంలోకి పోయాడు. మరొక చోట నలుగురు చేరి ఒక స్త్రీని పట్టుకోవటానికి పరిగెత్తుకుంటూ వస్తుండగా వారికింద భూమి బద్దలయింది, నలుగురూ భూగర్భంలోకి పోయారు, భూమి మళ్లీ మూసుకుపోయింది.

యశవర్ధనుడు తాను చూసిన ఈ వింత మరణాలను గురించి ఆలోచిస్తూ ఒక చోట నిలబడి, "భూదేవి క్షమించదని తెలిసి కూడా ఈ నగరంలో వుండే ప్రజలెందుకిలా పాపాలు చేస్తారు? వీళ్లకు చచ్చిపోతామన్నది ఆక్షణాన జ్ఞాపకం రాదా?" అని తనలో తాను అనుకున్నాడు.

"మీదే ఊరు, నాయనా?" అని అతని సమీపం నుంచే ఒక ప్రశ్న వినిపించింది. యశవర్ధనుడు ఉలిక్కిపడి చూడగా, అతని పక్కనే ఒక సాధువు నిలబడి వున్నాడు.

"మాది మిథిలానగరం!" అన్నాడు యశవర్ధనుడు.

"మీ మిథిలలో మృత్యువు చెప్పి వస్తుందా? అక్కడ ప్రజలుఆకస్మికంగాచావరా? అంతమాత్రాన వారుపశ్చాత్తాపపడి పాపాలు చేయటంమానేస్తున్నారా?" అని సాధువు అడిగాడు.

యశవర్ధనుడికి ఒక్కసారిగా కళ్లు తెరుచుకున్నట్టయింది. తాను చేసిన పాపకార్యాలన్నిటినీ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. అతనికి పశ్చాత్తాపం కలిగింది. అతను సాధువు కాళ్లమీద పడి, "స్వామీ, నేనూ ఒక పాపినే. చావు తప్పించుకోవటానికి ఈనగరం వచ్చి, తప్పించుకోవలిసింది చావు నుంచి కాదనీ, పాపం నుంచి అనీ తెలుసుకున్నాను. నాకు పుణ్యమార్గం ఉపదేశించండి!" అని ప్రార్థించాడు.

సాధువు యశవర్ధనుడికి పుణ్యమార్గమూ, ధర్మమూ, నీతీ ఉపదేశించాడు.



Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!






SUPER
RUBBER










THE

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



A. Seethadevi



A. Seethadevi

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఆగస్ట్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **అమ్మాయికి తప్పని బరువు!** రెండవ ఫోటో : **అబ్బాయికి ఉంటుందా కరువు!**

పంపినవారు : టి. శ్రీనివాసులు C/o. బి.వి. రమణ, ఫారెస్ట్ రేంజ్ ఆఫీసర్, 28-1063,
సాయిబాబా నగర్, నంద్యాల, కర్నూలు జిల్లా - 518 501 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతిప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

<u>సంవత్సర చందా:</u>

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

---

సీ మెయిల్ ద్వారా: రూ. 117.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 264.00

---

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

---

సీ మెయిల్ ద్వారా: రూ. 123.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 264.00

---

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026




ఇప్పుడు పార్లే పాపిన్స్ మజా సాగేను ఆగకుండా అలా...
ఇక ప్యాకెట్ యింతలో అయిపోతే మాత్రం ఏం యిలా



పార్లే పాపిన్స్ ర్యాపర్లు పంపించండి, ఉర్రూతలూగించే కానుకలు పొందండి.

**ఉచితం :** పార్లే పాపిన్స్ 20 ర్యాపర్లు పంపినప్పుడు పరిహాసం చిలికే పజిల్ కిట్. పార్లే పాపిన్స్ 10 ర్యాపర్లు పంపినప్పుడు ఫన్ ప్యాడ్ మరియు జంగిల్ బుక్ స్టిక్కర్. పార్లే పాపిన్స్ 4 ర్యాపర్లు పంపినప్పుడు జంగిల్ బుక్ స్టిక్కర్.

*పార్లే పాపిన్స్ యీ కానుక లేకుండా కూడా దొరుకుతాయి.




ఇప్పుడు పార్లే యొక్క కొత్త, పళ్ళ రుచులలో.

ఫ్రూట్ జ్యూస్ లేదా పల్ప్ రహితంగా,
అదనపు ఫ్లేవర్స్ సహితంగా.




పోస్టల్ స్టాంపులున్న కవరుపై మీ పేరూ,
అడ్రసూ వ్రాసి, దాంతోబాటు పార్లే
పాపిన్స్ ర్యాపర్లతోబాటు యీ అడ్రసుకు
పంపించండి : పాపిన్స్ పాయింట్, పి.ఓ.
బాక్స్-907, బొంబాయి-400 057.